మాలోచించిన యెడల బ్రాహ్మణుల కంటె నితర జాతులే పంచములయెడఁ గొంతవఱకుఁ గృపాస్వభావులై యున్నారని చెప్ప టతిశయోక్తి గాదు. హైందవసంఘశరీరము నాశించిన సంజురోగమనందగు నీ యస్పృశ్యతకుఁ గారణము పంచమకులజులొనర్చు పశుహింస, యపరిశుభ్రత మొదలగునవియే కాని వేఱొక్కటి కాదని చెప్పుదురు. నేనిప్పు డనరాదు గాని మనవు కొంతకాలము క్రిందటి వఱకు సత్యము, శౌచము మొదలగు సద్గుణంబులు గలిగిన బ్రాహ్మణపుంగవులే యనుదినము మాంసభోజనముఁ గావించుచుండి రని మన పురాణములు ఘోషించుచున్నవి. దీనిని బట్టి మాంసభోజనము మంచి దని నేను సమర్థించుట లేదు. కాని బ్రాహ్మణులు లోనగు వారు పంచములతోఁ గలిసి మెలసి యుండి నీతిబోధఁ గావించి యా దురాచారముల నెట్టులైన మాన్పింప వలెఁ గాని వారి నస్పృశ్యులుగా భావించు మహాపాతకంబున కొడిగట్టుట పాడి గాదు. ఆర్థికవిషయంబులచే నేమి ఇతరవిషయంబులచే నేమి యీ పంచమజాతివా రందఱును బై జాతులపై నాధారపడియున్నారు. స్వాతంత్ర్యవిరహితులై యిట్టి నీచతమ పారతంత్ర్యం బనుభవించు సోదరులయెడ నణుమాత్రం బైన కరుణాహృదయంబు చూపని యీ భారతీయులు పాపము పండఁగానే కొన్ని వందలసంవత్సరంబులకైనను స్వాతంత్ర్యదూరులై యవాచ్యంబైన పారతంత్ర్యమును బానిసతనమును ననుభవింపకపోరు. సర్వదయామయుం డైన భగవంతుం డిది చూడక పోఁడు. మఱియుఁ బంచములతో నిచ్చిపుచ్చుకొను బాంధవ్యంబును గలిగించుకొనుఁ డని కాని పఙ్క్తిభోజనంబులఁ గావింపుఁ డని కాని నేను మిమ్ముల నుద్బోధించుట లేదు. మీరు పశుపక్ష్యాదులనెట్లు చూచెదరో యీ దీనుల నంతమాత్రమైన జూడుఁడు. వా రల్పసంతుష్టులు. అంతమాత్రము చేతనే వా రందల మెక్కుదురు. ఓ మహాజనులారా! ఇకనైనను ధర్మపక్షాభిమానులై జాతిగుండెలనైనను గరగింపఁగల మాలమాదిగల యార్థికాదిదురవస్థలం జూచి కంటఁ దడిపెట్టి -- ఆదీనులను - ఆ దిక్కులేని పక్షులను - దయాహృదయంబునం జూచి యస్పృశ్యతాధానమహాపాతకంబునం బడక సమీపస్థులం జేసికొని విద్యాబోధ గావించి మీ యంత వారినిగాఁ జేసి యాఁకటిమంటలతో నేరియుచున్న యీ కృశించుకనువులకింత యన్నము వచ్చు మార్గంబులఁ బరిశోధించి దయాసత్యాదిసద్గుణసంపుటీకరణ మైన మీ బ్రాహ్మణత్వమును సార్థకపఱచుకొనవలె నని ప్రార్థించుచు విరమించుచున్నాను.

(తెరపడును)

దృశ్యము 12

బాలచంద్రుఁడు ప్రవేశము.

—§ బాలచంద్రుఁడు §—

గడువేడేండ్లు ముగించినన్ మఱల నా
గాంబాజ్ఞయా రాజ్యమం
దడుగుం బెట్టు నిమిత్తమై? దురవగా
హం బిద్ది నాబోంట్ల కా
పడుచుం జోదును రాయబారమునకై
పంపించిరే కాని యీ
పాడిమాటల్ ఫలియించునా యలుక ని
వ్వాల్ గాక గుర్జాలలోన్.

రాయబారి యెన్నిక చక్కగా నున్నది. కాని వారు రాజ్యమిచ్చుట మాత్రము సంశయాస్పదము. ఈ సంశయమే స్థిరపడునెడలఁ దండ్రిగారి ప్రాంతమునఁ గావించు పంచ మోద్ధరణోపన్యా





సములు రాజకీయోపన్యాసములు నూరకపోవునవి కావు. ఈ విషయంబులలోఁ గన్నమదాసు సేకరించిన సాక్ష్యపుఁగాగితములు తండ్రిగారికి వేవితంబుల సాయం బొనరించిన వని చెప్పవచ్చును. నాయకురాలు మా పట్లఁ గాని యితరుల పట్లఁగాని మఱి మఱు పేరులఁ గాని యెన్ని దౌష్ట్యంబు లొనరించినదో యత్యంత రహస్యముగా విచారణ గావించి వారు వారు చెప్పిన విశ్వాసపాత్రములగు విషయములు కాగితములపైఁ జేవ్రాలులతోఁ గూడఁ దీసికొని యీ సాక్ష్యపత్రసంపుటం బొనరించిన కన్నమదాసు ప్రశంసాపాత్రుఁడు. అలరాజు సాక్ష్యపుఁ గాగితములఁ గూడఁ దీసికొని పోవుట మొదటఁ గొందఱకు నచ్చలేదు. అతఁడు ముందు శాంతముగాఁ బ్రసంగించి చూచి రాజ్యప్రదానంబునకు వా రొప్పుకొన్నయెడల నా పత్రంబుల బయటికిఁ దీయఁడు. మాచెర్ల రాజ్య మొంతమాత్రము నియమని స్పష్టముగా వారు చెప్పినచో నా మహాసభలోనే పెద్ద లందఱు వినుచుండ నాయకురాలి దుండగము లన్నియు బయలు వెట్టి యిట్టి కుటిలచిత్తను మంత్రిణిగాఁ జేసికొనుట సంభావ్యము గాదని నలగామరాజునకు మనస్సున కెక్కించి యామె మాటలు విని రాజ్యం బొసంగకుండుట సమంజసము గాదని నచ్చఁ జెప్పును. అప్పటికిని రాజు విననియెడల గురిజాల మొదలగు ప్రదేశంబుల నుపన్యాసపరంపరల గావించి నాయకురాలిపై నసూయఁ గల్గించి ప్రజలు మనకు సుముఖులుగా నుండునట్లు చేయును. అందుఁ దప్పేమున్నది! (ఆలోచించి) మొత్తము మీఁద నాకుఁ జూడ భవిష్యత్కాలగగనము ఘోరవిషమాంధకారమయంబు గానే యున్నది. చెన్నకేశవుం డేమి చేయునో తెలియదు.

(నిష్క్రమించును.)

దృశ్యము 13

నలగామరాజు సభ.

నాయకురాలు — నరసింగరాజు — నలగామరాజు మాట్లాడు చుందురు.

—* నలగామరాజు *—

నాగమ్మగారూ! మీరు వినలేదు కాఁబోలు నింతకు ముందే వీరమేడపి నుండి రాయబారము వచ్చినది.

—* నాయకురాలు *—

వచ్చిన దెవరు?

—♦ నరసింగరాజు ♦—

అల్లుఁ డయిన యలరాజు మామగారితో సంప్రతించుటకు వచ్చినాఁడు. నాలుగైదు సంవత్సరముల నుండి యీ చాయలకు రాకున్నను — మంచికిఁ జెడ్డకు బ్రహ్మనాయని మల్లదేవుని వెనుక వేసికొని వాదించు నట్టి జామాత యేదియో మనసులో మూట గట్టుకొని శ్వశురగృహమునకు నేఁడు వేంచేసి యున్నాఁడు.

—* నాయకురాలు *—

ఏమి విశేషములు?

—♦ నలగామరాజు ♦—

ఇప్పుడు సభకు వచ్చి తెలియఁబఱచు నని తోఁచుచున్నది.

*— నాయకురాలు *—

విషయ మేమో గ్రహింపలేదా — నరసింగరాజుగారూ?

—§ నరసింగరాజు §—

మాట — మాట — వచ్చి వారి గడువేడేండ్లు నీ పుష్య శుద్ధ దశమితోనే చెల్లిపోయిన వని చెప్పినాఁడు.

♦— నాయకురాలు ♦—

వాస్తవమే.

— నలగామరాజు —

దీనినిబట్టి సర్వము తేటతెల్లముగదా.

— నాయకురాలు —

అవును. మరల మాచర్ల రాజ్యము తమ కిమ్మనుటకే యీ రాయబారము.

— నరసింగరాజు —

మరి మీ యుద్దేశ్యమేమి?

— నాయకురాలు —

ఒకరి యుద్దేశ్యములతోఁ బనిలేదు. శైవ మతోద్ధరణము — ననఁగా — దేశోద్ధరణము గావింప బద్ధకంకణులమై యీ యేడేండ్ల నుండి ప్రజాబోధము గావించి యహరహము సలిపిన కృషి యంతయు బూడిదలోఁ బోసిన పన్నీరుగాఁ జేయఁదలఁచిన యెడల వారి మాచర్ల రాజ్యము వారికి మరల నీయవచ్చును. కాని యిప్పు డాలోచింపవలసిన మహావిషయమిది. ఎన్ని కడగండ్లఁ బడినైనను సర్వస్వము దేశోద్ధరణము నిమిత్తము త్యాగ మొనర్చియైనను నీ శైవమతోద్యమమును సర్వవిధములఁ గొనసాగించుట కీర్తికాములగు రాజన్యుల కవసరంబనీయ మగునా? కాదా? చెప్పుఁడు. అయినను మే మీ విషయ మీవరకే చర్చించితిమి. మీ యన్నగారు తుద కైనను నా యీ వాతో నేకీభవించినందులకు సంతోషము.

— నరసింగరాజు —

లెస్సగా నాలోచించితిరి.

సేవకుడు

(ప్రవేశించి) అయ్యా! దండాలు. అలరాజుగారొస్తున్నారు.

— నలగామరాజు —

మంచిది.

(నరసింగరాజు నాయకురాలు నెదురు వోవుదురు.)

— నాయకురాలు —

అలరాజుగారికి నా యభివాదనములు.

— అలరాజు —

పెద్దలకు నమస్కారములు.

(రాజున కెదురుగాఁ బోయి)

గురిజాల సింహాసనాధ్యక్షులకు వందనములు

— నలగామరాజు —

(చిఱునవ్వుతో) కూర్చుండుము.

— నాయకురాలు —

రండు. ఈపీఠం బధిష్ఠింపుఁడు.

— అలరాజు —

(కూర్చుండును)

— నాయకురాలు —

(కొంచెమాఁగి) సకుటుంబపరివారులగు మల్లదేవులకు క్షేమమా?

— అలరాజు —

చిత్తము. క్షేమముగా నున్నారు.

— నాయకురాలు —

బ్రహ్మనాయునికిని నాతనికుటుంబమునకును సౌఖ్యమే? మీ తండ్రిగారు సుఖులే?

— అలరాజు —

అందఱు దైవానుగ్రహంబున సుఖులై యున్నారు. నాయఁడుగారు, మల్లదేవులు మొదలగు వారందఱును బేరు పేరు వరుసల మిమ్ముల నడిగినట్లు చెప్పు మనినారు.

— నలగామరాజు —

అలరాజా! అక్కడి విశేషంబులు చెప్పుము.

— అలరాజు —

విశేషంబు లేమున్నవి! ఎవ్వ రెన్ని కష్ట పరంపరలం గూర్చుచు వలజడి వెట్టుచున్నను నఱచేత నిట్లో ప్రాణంబులు దాఁచుకొనుచుఁ దొలుకాఱు మబ్బు చినుకులకై వేచు చాతకంబుల రీతి మీ సోదరులు స్వరాజ్య సిద్ధికై యువ్విళ్లూరుచున్నారు.





నలగామరాజు

జగద్రక్షకుం డగు నా మహేశ్వరుఁడే యెవ్వరికే కష్టములం గూర్చినను. అయినను నా రెట్టి యిడుమలం బడిరో గురిజాల కేమియుఁ దెలియదు.

అలరాజు

సింహాసనాధ్యక్షు లెన్నఁడో కాని ప్రజాసంఘంబుల లోనికి రా వీలుపడదు. నిరంతరము గద్దెపై నుండి పరోక్షజ్ఞానంబున బరిపాలనంబు సేయవలసి వచ్చు ప్రభువుల కివి చెవింబడుట కంతగా నవకాశముండదా గదా.

నరసింగరాజు

వా రక్కడ స్థిరనివాస మేర్పఱచు కొన్నట్టు లేనా, అలరాజా?

నాయకురాలు

ఆఁ. అంతియే.

అలరాజు

మామగార్లకు నమస్కారము లొనర్చి నా యీ చెప్పుమాట లాలకింపవలెనని వేఁడుచున్నాను. ఆ నాఁడు మీరు కోడిపందెం బొకటి పెట్టి నిష్కల్మష హృదయు లగు బ్రహ్మనాదుల నోడించిన వెనుక వారు నిత్యసత్యవ్రతానుష్ఠానులగుటచే నాడిన మాట దప్పక సత్యమును బరిపాలించుటకై యడవుల పాలయి పోయి యించుకేనియు సమయభంగంబు గావింపక యోర్పనెడి నావపై నెక్కి కష్టసముద్రంబు దాఁటుచు నీ పుష్యశుద్ధ దశమితో నేడేండ్ల గడువుఁ బూర్తి గావించినారు. అకుటిల ప్రవర్తనులును మాననీయులు నగు మల్లదేవుఁడును, బ్రహ్మ నాయఁడును గడువు దాఁటిపోయినను గురిజాల లోని తమ యొక్కయు ముఖ్యముగా నాగమ్మగారి యొక్కయు నాజ్ఞ లేనిది మాచెర్లం బ్రవేశించుట పాడి గాదని తలంచి మీయనుజ్ఞఁ గైకొని రమ్మని రాయబారిగా నన్నంపినారు. రెండు పక్షంబులకును గావలసిన వాఁడ నగుటచే నా మాటలకుఁ గొంత విలువ గలదనియు నవి స్వీకరింపఁబడవనియు విశ్వసించుచున్నాను. కొల్లకారు వీరులందఱు గడువుఁ బూర్తి గావించిన వెంటనే మాచెర్లం బ్రవేశించుటయే పాడి యని యెంత నొక్కి వక్కాణించినను దమ సోదరుఁడు పెదమల్లదేవుఁడును సద్గుణమూర్తి యయిన సత్త్వస్వరూపుం డగు బ్రహ్మనాయఁడును వారిని మందలించి తమ కరుణకుఁ బాత్రులై పరస్పరస్నేహం బలవఱచుకొని యుభయపక్షామోదకరంబుగా నుండు నట్లు రాజ్యంబులో నడుగు వెట్టఁ దలఁచినారు అట్లు సిద్ధాంతీకరించుటకుఁ గారణము బలహీనత గాదని యెల్లరకుఁ దెలియును. ఇంతకు మున్నెన్నియుద్ధంబులలో బ్రహ్మనాయఁడు ధనురాద్యాయుధంబులు గొని నిరవధికపరాక్రమంబున జిచ్చఱపిడుగై శత్రుసంహారంబొనర్చి వీరాధివీరుం డని విఖ్యాతి వడసి నానారాష్ట్రయోధవరులందఱకుఁ బ్రక్కలో బల్లెమై యెల్లు దిగంతరంబుల యశశ్చంద్రికల వెదఁజల్లి యుండెనో తమ కెఱుంగనిది గాదు. అట్టి మహాసత్త్వసంపన్నుఁ డగు బ్రహ్మనాయఁడు తన సద్గుణంబుల కన్నిఁటికి వన్నె దెచ్చునట్టి యమితవినయంబున స్నేహహస్తంబు చాఁచుచు మంచిమీఁదఁ గార్యానుకూల్యంబునకై యెదురు చూచుచున్నాఁడు. విధివశంబున బాహిరంబుగాఁ బల్నాటి రాజ్యంబు రెండు చీలికలైనను నాంతరంగికంబుగ రెండు రాజ్యంబులు నొక్కటియే యని శత్రువులు దలంచునంతటి యైకమత్యంబునకు దోహదంబులు గావింపవలసినదని

తమతో మనవిఁ జేయు మని సన్నంపినారు. నా
రంపిన యీ సందేశంబులోని యుత్కృష్టతఁగూర్చి
యుక్తాయుక్తజ్ఞు లగు తమ రనుమానింప రని నా
మనస్సాక్షి నా కభయ మిచ్చుచున్నను రెండు
దెగల వారికిని బాంధవుండను గాన నా సందే
శంబు రిత్తవఱచవల దని జేలతనంబున మఱొక్క
మాఱు ప్రార్థించుచున్నాను. (కూర్చుండును)

—* నలగామరాజు *—

(నాయకురాలి వంకఁ జూచును.)

—* నాయకురాలు *—

(లేచి) సందేశహరు లగు నలరాజుగారికి
గురిజాల ప్రభువుల పక్షంబున బ్రత్యుత్తర మిచ్చు
చున్నాను. అశేషపరాక్రమోపేతుం డగు నలు
గురాజు దాఁటు వఱకు నీ పల్నాటిరాజ్యం బొక్క
టిగ నుండి శత్రుకోటిని గన్నెత్తనీయకుండెను. బ్ర
హ్మనాయఁడు మ యోపాయంబుల వలన శైవ
మతాభిమాని యయిన మల్లదేవునికి వైష్ణవమత
బోధ గావించి యాతని కని మాచెర్లభాగంబు బ
లాత్కారంబున నూడఁబెఱికికొని వెడలినప్పటి నుం
డియు మాకును మా ప్రజాసంఘంబులకును మితి
లేని విచారంబు గలిగియుండుటవలన నెట్లయినను
మఱల రాజ్యంబు నొక్కటిగానే యుంచి
పాలించిన మొదలఁ బూర్వపుఁ గీర్తి నిలువఁ
బెట్ట వచ్చునని తలంచితిమి. ఇట్టుస్థిరాభిప్రా
యమునకు వచ్చుటకు శైవమతోద్ధరణము
నందలి యభిమానము గూడ నొక కారణమని
గ్రహింపవచ్చును. మాచెర్లరాజ్యంబు వారేలు
చుండు నంతకాలము వైష్ణవాదర్శంబుల యుల
జడికి మన శైవమతం బెంతటి చిక్కులు వడెనో
శైవమతాభిమాను లగు తమకును దెలియనిది
కాదు. ఇప్పుడు మఱల మాచెర్లరాజ్య మిప్పించు
టకై శైవమతస్థు లగు మీరే వేంచేయుట
చూడ నిజముగా నేత్రకఠోరముగా నున్నది. ఈ
గురిజాల సింహాసనాధిపతులు శైవమతప్రాబల్య
మను దేశోద్ధరణము కొఱకు దీక్షాకంకణబద్ధులై
యిది వఱకేఁ గలిగిన రాజ్యవిభాగమునకు వగ
చుచు నిఁక ముందొక సూదమోపు నేల నైనను
నా మతభ్రష్టుల కీయఁ దలంప లేదని నొక్కి
వక్కాణించుచున్నాను. మా యనుజ్ఞ లేకుండ
మాచెర్లం బ్రవేశించుట సంభావ్యము గాదని హె
రించుట మిగులఁ బ్రశంసార్హ మని యభినం
దించుచు నిట్టి ప్రతికూల ప్రత్యుత్తర మివ్వవలసి
వచ్చినందులకు మిక్కిలి విచారించుచున్నాను.

—* అలరాజు *—

గురిజాల రాజన్యులను మఱొక్కమాఱు
వినయపూర్వకముగఁ బ్రార్థించుచున్నాను. సమగ్ర
యుద్ధకౌశలంబున నందెవేసిన చేతు లనందగు
నట్టి యీ శైవ వీరులందఱు వినమ్రులై మీ
కరుణాకటాక్షములకై యట్లు వేచియుండ నా
మహామహుల నిట్లు చిన్నచూపుఁ జూచుట
తమకు న్యాయము కాదేమో యని సందేహించు
చున్నాను. సమాన బలశౌర్యంబులు గల వీరు
లిట్లు మీ స్నేహసుగంధంబు నాఘ్రాణించి యభీష్ట
సిద్ధిఁ గోరుచుండ — సిరి రా మోకా లొడ్డుట
ప్రాజ్ఞుల యెత్తుగాదు. వారైనను దమకు న్యాయ
ముగా నీవఱకుఁ బాలించుచుండు రాజ్యంబే
మఱల నిమ్మనుచున్నారు గాని వేఱుగాదు. వారి
మతప్రచారమును గూర్చి మన మేవగించుట
తగనిపని. నే నెంత శైవమతాభిమాని నైనను
న్యాయమెద్దియో యది నిరూపింపవలయుఁ గాని
తదితరంబునకు నా హృదయం బంగీకరించుట
లేదు. మాచెర్లలో వారుండునంత కాలము శైవ





మతంబు చిక్కులు వడిన దని నాగమ్మగారు సెల
విచ్చుచున్నారు. కాని యీ యేడేండ్ల నుండియు
వైష్ణవుల యవస్థ యెట్లుండెనో యని వారును
దిగు లొందుచున్నారు. ఇట్టి యావేగ మధికార
వ్యత్యయముచేఁ బరిస్పష్టముగా నుండును. బుద్ధి
మతులగు నాగమ్మగారికి నే జెప్పఁగలవా డను
గాను.

—§ నాయకురాలు §—

ఈ యేడేండ్ల నుండియు వైష్ణవులయెడ
నతికఠినముగాఁ బ్రవర్తించినామని వారితోఁ జెప్ప
వచ్చును. అట్లు ప్రవర్తింప వలసినదే. కుటిలబుద్ధు
లకు మతాభిమాన ముండదు గాని మా బోంట్ల
కది యుగ్గుఁబాలతోఁ బెట్టినది.

—♦ అలరాజు ♦—

మతాభిమానమునకును మతమాధ్యమున
కును గల తారతమ్యమును నాగమ్మగారు గ్రహిం
పవలెను. మతమాధ్యము లేని వారికిఁ బరమత
సహన ముండును. పరమతసహనమే స్వమతమున
కును నభివృద్ధికారణము.

—§ నరసింగరాజు §—

ఎంత కాదనినను నెవరి కున్న మత
మాధ్యము వారి కున్నది గాని లేకపోలేదు.

—♦ నాయకురాలు ♦—

ఉండిన నేమి లేకున్న నేమి? ఆ విషయము
తఱచు టెందులకు? వారికి రాజ్యంబులోఁ బాలా
సంగమని మాత్రము నొక్కి చెప్పవచ్చును.

—‡ అలరాజు ‡—

మాచర్ల రాజ్యంబు మఱల నా మహా
మహులకుఁ బ్రసాదించుటకు మీకేల సందే
హింపఁ గలరో నాకు గోచరించుట లేదు. నాగమ్మ
గారు దూర మాలోచింపవలె నని కోరుచున్నాను.

—‡ నాయకురాలు ‡—

కడుదూర మాలోచించియే రాజ్యభాగము
లేదని చెప్పుచున్నాను.

—‡ అలరాజు ‡—

నిశ్చయమేనా?

—* నరసింగరాజు *—

సందేహించు టేలకో?

—§ నాయకురాలు §—

అలరాజుగారు రన్యమతస్థులను మహామహు
లని సద్గుణసంపన్నులని వేనోళ్ల భట్టువలెఁ బొగ
డుట నింద్యము.

—* అలరాజు *—

గిల్లి జగడమునకు రావలదు. చిన్న పెద్ద
లను తారతమ్యంబు గ్రహించుట పాడి యగును.
ఓర్పునకు మితిగలదు. నేనెంత సహనము వహించు
చున్నను నిట్లు నిరాదరణపూర్వకముగఁ బలుకుట
నాగమ్మగారికిఁ దగదు.

—* నాయకురాలు *—

సహనముఁ జూపింపక యూరకుండఁ జేయు
నది యేమో తెలియదు.

—§ అలరాజు §—

ఓహో! మా సహనము నాగమ్మగారి కపహాస్య
మాయెనది కాఁబోలు. జలధిలో నిమిడియున్న బడ
బాగ్ని వలె మా శాంతమున బరాక్రమోద్రేకము
సమ్మిళితమై యున్నదని నాయకురాలికి శీఘ్రంబున
బరిస్ఫుటము గాక.

మాచెర్లరాజ్యం బవలీల గ్రహింప సమర్థు
లయ్యును నటుపోక ముందుగా మీ యనుజ్ఞఁ
గోరునట్టి వారి సుగుణసంపద యెంత శ్లాఘాపాత్ర
మో మీకు గోచరింపక పోవుట విచారకరము.
రాజుగారు గూడ నిట్టి వక్రపద్ధతికి ననుకూలించు
చుండుట చూడ వింతగా నున్నది. ఎవరి సంద

చూచికొని గురిజాల యీ బింకంబులు చూపుచు న్నదో గోచరింపదు. బ్రహ్మనాయని కుమారుం డగు బాలచంద్రుండు మొదలగు వీరులు కఱకు గుండియలతో యుద్ధభూమిం దుమికి హాస్తోల్లసిత కరవాలంబుల ఝళిపించి మీ సేనల నన్నింటిని నుగ్గునూచం బొనర్పు నప్పుడు గాని నా మాటలు రుచింపవు. ఆ నాఁడు శ్రీకృష్ణుం డెంత సంధిని గూర్చ నొక్క వక్కాణించినను వినక చెడిపోయిన దుర్యోధనుని దురహంకారఫలమును నాగమ్మగారు జ్ఞప్తికిఁ దెచ్చుకొనవలసి యున్నది. (రాజుంజూచి) నే నంటినని కోపంబు రానీక చివరకు బాలచం ద్రుని చేతికాండ్రిలో నొక్కనితో నైనను యుద్ధ భూమిం జోరునట్టి వీరాగ్రేసరుని మీ పక్షంబున జూపింపుఁడు, నాయుఁడు రాలందురా? అది వట్టి కల్ల. అఁడు దానిని జంపుట సాడిగా దని తారు సం దేహింపని యెడల మహాఖ్యాయువు ముందు దూది త్రుంపురుల వలె బాలచంద్రాదుల యెదుట సీమె శౌర్యధైర్యపరాక్రమంబులు నిమేషంబున బంచ బంగాళమై పోవును గాని నేటొండుగలదా? ఆమె మెంతటి కృత్రిమోపాయంబులకు బుట్టినిల్లు? మంచి యాలోచన యామె కొంటవు. ఇట్టి నిరుపమానవ క్రోపాయధురీణను మంత్రిణిగాఁ జేసి తమ బోటి వారు న్యాయపథంబును విడనాడుట సమంజసమా యని సందేహించుచున్నాను. ఎట్టి కుటిలోపా యంబులు వహించి బ్రహ్మనాదుల యెడ నిప్పుడే విధంబుగా నీవిడ ప్రవర్తించెనో లిఖితరూపక మైన సాక్ష్యంబుల జూపఁగలను. మొట్టమొదట మాచెర్ల యందు వారుండునప్పుడే గురిజాల వర్తకు లని పేరు పెట్టి రాజభవనంబున జేయించిన దోపిడిఁ గూర్చియు మొన్న మొన్న భిల్లులం బంపి వారి పశువుల దోఁచించు ప్రయత్నంబులఁ గూర్చియు నీమెపైఁ దగినంత నేరము మోపఁగల బలమైన సాక్ష్యము లున్నవి. అవన్నియుఁ దమరు చిత్తగింప వలెనని కోరుచున్నాను. ఇట్టి దుర్మార్గశీల యయిన నాగమ్మ మాటల విని స్వచ్ఛకీర్తులగు మీరు నిం దలపాలు గావలదని మనవిఁ జేయుచు నీ సాక్ష్య పుఁ గాగితములఁ జదివి యామె దుర్మార్గంబుల ధ్రువపఱచుచున్నాను. (తీసి చదువఁ బోవును.)

— * నలగామరాజు * —

ఈ దిన మింతటితోఁ గొలువు చాలించు చున్నాను. మఱల రేపటి దిన మాలోచింప వచ్చును. (అందఱు లేచుదురు. తెరపడును)

— * అలరాజు * —

(ముందునకు వచ్చి) మామగారెంత మా యావి! (ఆలోచించి) సరి కానిమ్ము. రేపు చూచు కొందము.

(నిష్క్ర-)

### దృశ్యము 14

అలరాజు బస - గురిజాల.

శమము దమంబు నార్జవము శాంతియు బోష్మణజాలి కైన వి చ్ఛము నిడఁజాలఁ డుత్తముఁడు శత్రువిలాసవతీసుశుంకలీ త్వము లఱచేతఁ గొన్న బలవంతుఁడు ధీరుఁడు బ్రహ్మనాయఁడే సమమతిఁ జెల్మిఁగోరి చెయిఁజాచ గ్రహింపరుగాము కోద్ధతుల్

అంత మహామహులం దఱఁగి న్యాయపథప్రవిచింత్యరాజ్యసం క్రాంతిని గోర దానిని నిరాకరణంబొనరించు దుర్మద స్వాంతులు కాలు నేయి దగినప్పుడు గాఁ గ్రహింపరక్కటా యెంతటి నష్టజాతకమొ యీ గురిజాల్పురరాజ్యలక్ష్మికిన్.

మఱియు,

రెండవ చేతి కిటులకు బాంధవుండ వనుచు
ద్రవ్యాశలశాత్రుడు నటించుఁ దలఁచి నాఁడు
చనిటి నేలకు నాటు బీజములు వోలె
సర్వయత్నంబు లిందు నిష్ఫలములయ్యె.





నిన్నటి దినమే కవిగాయకనర్తకవందిమాగ ధాదిగౌరవసభ్యులతో బలసియున్న నిండుకొలు వున దురాచరణశీల యైన నాయకురాలిపై నిందా రోపకమైన లిఖితరూపక మయిన శ్రోతృహృదయ విదారకం బయిన పత్రసంపుటంబు వెలికిం దీయ నప్పుడే యీ ధూర్తాంగనాముఖంబును — సంత కంటె వేయిరెట్లుగా — దానిని జేరఁ దీసి సర్పం బునకుఁ బాలోసి పెంచు నట్లు తగువిధంబుల నాదరించు మాధాత్ముం డగు నలగామరాజేంద్రుని మొగంబును మటమట మాడి పోయినవి. అది నే జూచియు విషయము వినువక చదువం బోవు చుండ నలగాముఁ డది మఱునటి దినంబు చూచుకొనవచ్చు నని యుద్దేశించి సభ నంత టితో నాపి వైచెను. నిందారోపకమైన యీ గ్రంథం బంతయు సభాస్తారు లందఱును విని పోవుదు రని శంకించిన మామగారి హృదయంబు నేమ నవలెనో తెలియకున్నది. ఉన్నవిజము కొంత యిదివఱకే యీతని కిఁ దెలిసి యుండినదా యని సందియము గలుగుచున్నది. లేకున్న యెడల రాజయిన వాఁడు సత్యపరిశీలనార్థము రాచకర్జంబు లెంత చక్కఁగా సిరండ తగులఁబెట్టు చున్నదో పోని చెవిని వేసికొని యనంతరము నా వాదమును ఖండింపరాదా? ఇంట నున్న విధవా పుత్రికచేఁ గామోద్రేకనిరోధకధర్మంబు లాచరిం పింపక మహాకాలజ్ఞానశూన్యులై యామెకు వివా హంబు సేయనేరక పతితమకుఁ బెనఁగులాడి దుష్ప్రవర్తనంబున లంకించుకొన్న యామె గర్భోత్పత్తిని దాఁచు శాస్త్రజ్ఞు లయిన తల్లిదండ్రుల వలె నల గాముఁడీ మాయలాడి దుశ్చరితంబులోని సత్యము మునుము న్నడఁగియే పరువు పోవునని దాఁచ నెంచెనేమో! అట్టి సందర్భంబుల యందు సత్యా న్వేషి యయిన వాఁ డెవ్వఁడైన సభ నావునా? తమ పరిపాలనములోని లోపంబులఁ గాని రాజో ద్యోగుల దుష్ప్రకారంబులఁ గాని కల్లబొల్లి మాటలతో నెట్లో శ్రమపడి మఱుఁగుపుచ్చుట నిరంకుశప్రభువులకు సహజగుణము.

మఱల నీ యుదయంబున నేను గొలువుం జేరకమునుపే నేను సభకు రాఁగూడదనియుఁ ద్వరలో గురిజాల వీడి పోవలెననియు నెట్టి రాజ కీయప్రసంగంబులును నీ మండలంబున నెచ్చటను గావింపరా దనియు నొక నోరుమూఁతయాజ్ఞ నల్లి రాజముద్రాశిఖాంచితమై దూరాలోచనాభావ కపటోపాయంబులకు బిరుదుటందెలు వేసికొని శున కము వలె నభాత్యపీఠం బధిష్ఠించి యున్న నాగమ్మ యొక్క చేవ్రాలును గలిగిన యొక్క యాజ్ఞాపత్రింబు నాకంపినారు.

రాజ్యభాగమునకు ననేమిరా యనుచున్నారు సరిగదా యీ దుర్మార్గపరివర్తిని దుండగంబుల నైన బహిరంగసభలలో వెలిబుచ్చి పోవుట నాకు ముఖ్యకర్తవ్యము. కాని నోరు మూయింపఁగల రాజాజ్ఞ నెట్లుల్లంఘింపఁగలను? (యోచించి) [illegible] అయినను మన బంధువర్గము చెన్నగుడిపాటులో నుండెఁ గదా. వారితోఁ గూడఁ గలిసి ప్రస్తావించి యనంతరము కర్తవ్య మాలోచింపవఁగాక. నేఁడీ తెలివితక్కువ నోరుమూఁత కాగితము వీరమేనవి లోని మల్లదేవ భూపతికి ముందుగాఁ బంపుచు నింతపఱకు జరగిన

—◆ మల్లదేవుడు ◆—

ఎంత ధూర్తాంగన యైనను నాయకురాలింత సాహసించ నొడిగట్టునని స్వప్నంబున నైనను దలంపమైతిమి గదా. రెండు పక్షంబులకును నతనికిఁ గల చుట్టరికము కాకుండఁ బుష్పము నాశ్రయించిన మకాపన వలె నాతని నాశ్రయించిన బంధుమర్యాద, యుక్తిక్రృతకార్యదీక్ష, మతసహనము, వచో మార్దవము, సత్యధర్మోద్ధరణకౌశలము మొదలగు సద్గుణంబులును గలిగియుండుటచే నలరాజు మన దృష్టి నాకర్షించినాఁడు. అందుచే గార్యానుకూల్యంబునకై వంప సాహసించితిమి. చివర కెంత పని జరిగినది! ఆ నాఁడు మొదటినుండి బయలుదేఱుచు సమస్తబాంధవపరివారకబృందంబులు వినుచుండఁ బాండవపక్షంబుఁ బురస్కరించుకొని చనిన శ్రీకృష్ణుని రాయబారంబు గూడ నిందాగర్భవచనంబుల నీసడించుచు — మనుష్యప్రయత్నంబున గొంతంత యావంతయు లేకుండఁ గార్యనిర్వహణయజ్ఞదీక్షాకంకణబంధంబున బ్రయత్నించు నని ధర్మదేవతారాధకుండయిన యలరాజు వాగ్దానమొనర్చినప్పుడు ఫలించిన ప్రియాసేవావాక్యంబులు తలఁపునకు వచ్చి నాయెడ లిప్పు డుశ్వాసమ్మిళిత మయిన విచారంబునఁ గంపించుచున్నది. ఆ నిష్కామసేవయే యాతని పవిత్రశీలమునకుఁ బ్రాణము.

—◆ బ్రహ్మనాయఁడు ◆—

రాజచంద్రా! అలరాజు వంటి ధర్మపక్షాభిమాని వీరపురుషుండు మఱొకఁడు లేఁడు.

తేజస్స్ఫూర్తి బల్లవంబుగ బ్రజా
నిశాకరప్రకాశా

ప్రీతిం బోరుము ధర్మరాగి మన యా
పీఠం దనంత్యార్జనా
గారంబర్వము వట్టిపోవదు; ధవి
స్పష్టజ్ఞ తెలుపుచుంటిమా
గీతాశాస్త్రము బోఁచె జెప్పె నిజ శ్రీ
కృష్ణుం డనేకుంబుగా.

మతసంపూర్ణ బుద్ధిమంతు లివి; ధ
ర్మం బే విచారించి యీ
కృత ధైర్యంబున మాకు దైన్యపుటకా
దైవుండు సాయంబు నీ
యీ తలం బోర! ప్రశంసనీయము సుధా
ధుర్యంబైన ధీశాలికిన్
మతవిద్వేషము యిందు నేర్ మరియు
ధర్మిస్థాయి మహిష్ఠాటికిన్.

ఆకసంబున నుత్తరదిక్కున స్థిరముగా నుండి చలింపక విభాసించు ధ్రువనక్షత్రము మాడ్కిఁ బ్రాజ్ఞుని మనస్సు ధర్మనిరూపణంబున నిశ్చలమై ప్రకాశించు నని యలరాజుచరిత్రము సూచిపఱచుచున్నది.

—◆ కన్నమదాసు ◆—

తండ్రీ! ఈ ధర్మప్రసంగము లింతటితో జాలించిన మే లని మనవిఁ జేయుచున్నాను. అలరాజు మరణము వినిన మా యన్నదమ్ము లిద్దరి హృదయంబు లనెడి యగ్నిపర్వతములు స్తిమితము లంబులుగాఁ గన్పడినను నంతర్భాగంబున బ్రజ్వలించుచుఁ దపించుచున్నవి. అజీర్ణరోగి కన్నంబుపై విరక్తివలె నీ యకాలధర్మప్రసంగంబులు కోపదందహ్యమాను లగు మాకు రుచించుటలేదు.

—◆ బాలచంద్రుఁడు ◆—

అన్నయ్యా! ధర్మప్రసంగములకును కొంతం బునకును విధి యుండి సమయము. నీ వేల వా





రించెదవు! (కొంచెమాగి) ఆహా! ఇంతటి ఘోరహత్యఁ గూర్చి వినియు శత్రుపక్షంబు గూర్చి యొక్కమాటయునకు సహించియుండుట పల్నాటివీర్యంబున కెంత కళంక మావహిల్లినది! అశేషబాహుబలసంపన్నుఁ డయిన యలరాజు చావు నా హృదయంబున గొఱ్ఱు గ్రుచ్చి పరిపీడనం బొనర్చుచున్నది. గండరగండఁడును మన పక్షంబున గల వీరు లందఱిలోఁ దలమిన్నయై తన భుదండచద్విక్రమప్రాభవంబునకు వన్నె వెట్టు తాంతికాంతనత్యాదిసకలసద్గుణవాటీలతికల కాలవాలంబు నయిన యలరాజును నిష్కారణంబుగా నింకుకొలువులో మొట్టమొదట నీసడించుటయే కాక తుదకు విషాహారంబు వెట్టించుటకును బాల్పడిన యా జగజంతయగు నాయకురా లింకను జీవించియుండు నట్లు చూచుట యవంధ్యంబైన యీ పౌరుషంబునకు గొప్పవోటుదనము కల్పించుట తప్ప వేఱుగాదు. మలిదేవపక్షంబు సెడల నాబిడ గావించు దుష్టోపాయపరంపరకుఁ దలమానికం బనం దగిన యలరాజవిషాహారప్రయత్నంబు గూడ నెఱవేర్చి యిప్పటికిని వీడని మన నిస్సహాయత్వంబున మిడిసిపడుచు నింకను జీవించుచు — ఆ నాగి — మన వీరుల మగతనంబును బ్రశ్నించుచున్నది. ఇంక నేను సహింపలేను.

(కోపముతో)

అలరాజంతటి మేటివీరుని విషా
హారంబునం గొన్న ని
ష్ఠురమాయావిను లైన ఘాతుకుల గొం
తుల్గోసి రూపార్ప నే
ట్టుల జీవింపఁగ వచ్చుఁ గోపదహనా
టోపంబు శాంతించునే
గళమున్మత్తవిరోధికంఠగళర
క్తప్రావాహం బెసఁగన్

భవనిధిఁ బాదిరొంచుఁ బ్రమ
దంబున మండెడి బోళియాద్రి బం
ధవ మగు కాంతమం గని మ
నంబున బొంగుచు నుండఁ డింక నే
జని గుదిపాలరాజ్యబల
కాలినయామయ ఖడ్గధారచేన్
వినక మొనర్చి రాజ్యముగ
నేఱు బుసాదులతోఁ దెగకొ్ర్చెదన్,

—◆ కన్నమదాసు ◆—

(కోపముతో లేచి) తమ్ముఁడా ఇదిగో నీతోఁ గూడ నేనును వచ్చుచున్నాను. యుద్ధమాడి మాచెర్లరాజ్య మూడఁబెఱుకుదము లేదో దేవుఁ డెఱుఁగును. పిలప్రాయమున నుండి నిష్కామధర్మసేవాశుద్ధిచేఁ గీర్తికాంతాన్వయాగ్రహాశ్లేషభాగ్యంబు ననుభవింపఁ బోవు రాయబారియగు నలరాజును జంపించిన మాయానిపుణయైన నాయకురాలిని — ఉట్టి త్రాళ్లతో బంధించి యవమానపఱచిన గాని నా మన సూరకొనదు. బాలచంద్రా! లెమ్ము. పోవుదము.

—◆ మల్లదేవుడు ◆—

దాసూ! తొందరపడకుఁడు. విషాహారం బెట్లు వెట్టించి యలరాజును బొలివుచ్చెనో విషయం బామూలాగ్రముగఁ బోతరాజు గారిని జెప్పనిండు. (పోతరాజుతో) రాజుగారూ! విషాహారదాన సంవిధానంబు సవిస్తరంబుగా వినఁదలఁచితిమి.

—◆ పోతరాజు ◆—

చిత్తము. నోటిమాటఁ తడాగితవు నాఁటి వేకువజామున బయలుదేఱి యలరా జందల మొక్కసేవకులతో గూడ వచ్చుచుండెను చెర్లగుడిపాటి మార్గంబున నున్న చిట్టడవిలో మొగమున విభూతిరేఖలును జెవుల యందును నందిటను గంతంబునను దలపట్టును రుద్రాక్షలదండలును గలిగిన శైవు

లిద్దరు చెట్టునీడ వంటఁ జేసికొని భోజనముఁ జేయ సిద్ధముగా నుండినట్లు గన్పడిరి. అలరాజును జూచి మరియాదఁ జేసి, "దిగి శివపూజఁ జేసికొని సిద్ధాన్నం బారగించి పొ"మ్మని ప్రార్థించిరి. అలరా జొప్పుకొనెను. సేవకులు చేరువకొలనిలో స్నానంబు సేయఁ బోయిరి. అలరాజు భోజనముఁ జేసిన వెంట నే వాంతులు ప్రారంభమై సేవకులు దిరిగి వచ్చునంతలో బ్రాణంబులు విడిచెను. చెట్టుదరికి వచ్చుచున్న సేవకులు దూరముగా నడవిలో గుఱ్ఱముపైఁ బోవుచున్న నరసింగరాజును జూచి సందేహించిరఁట. తరువాత వచ్చి యలరాజుం జూచి విక్కిలిగా నేడ్చి చెర్లగుడిపాటిలోని బందుగు లందఱకు వచ్చి తెలిపిరి. అంతట మే మందఱము పోయి శవంబు నింటికిం దెచ్చి తుదిపను లన్నియుఁ గావించితిమి ప్రైన-.

—* బ్రహ్మనాయఁడు *—

రాజుగారూ! మీరు చెప్పినసంగతులఁ బట్టి చూడ నా సమయంబున దూరంబుగాఁ జనుచున్న నరసింగరాజుపై నైనను నేరము మోపఁదగు నేమో కాని కొంచెమైనను సాక్ష్యము లేనిదే యీపాతకము నాయకురాలిపై నెట్లు వేయఁగలము?

-§ బాలచంద్రుఁడు §-

(కన్నమదాసుతో) చూడు.

-‡ పోతరాజు ‡-

చిత్తమదియే చెప్పుచున్నాను. ఆ బాటసారు లిద్దరు నలరాజు సేవకులు వచ్చుచున్నారని కాఁబోలు డావడిలో విడిచిపోయిన యొక చిన్న మూటలో నొక యుత్తరము గన్పడినది. చేవ్రాలు మాత్రము లేదు గాని యది చూడఁగా నాయకురాలి వ్రాఁతగా స్పష్టముగాఁ దెలియుచున్నది. శైవమతోద్ధారకు లగు నే జంగాలగురువునకో యది వ్రాయఁబడినది. ఇదిగో, యుత్తరముఁ గూడఁ దెచ్చితిని జూడుఁడు.

-§ బ్రహ్మనాయఁడు §-

కన్నమా! ఆ లేఖఁ జదువుము.

-* కన్నమదాసు *-

(చదువును.)

శైవమతోద్ధారకులగు.......... గారికి:-

శైవరహస్యాలోచనసంఘనిబంధనలలోని యేనిమిదవ నిబంధన ననుసరించి — వైష్ణవ మతస్థులపై నాదరణము సూపుచు లెన్నగా వారి యభివృద్ధికై తోడ్పడు వారియెడఁ దమరు కఠినముగాఁ బ్రవర్తించి మతపీఠంబుల మెప్పును జూఱ గొనుట లోకవిదితము. ఇప్పుడు మఱల నొక్కపరి యట్లే మాహేశ్వరసేవఁ గావించు నదృష్టము గల్గినన్నది. ఇందులకుఁ దా మభ్యంతరము సెప్పరని నా విశ్వాసము. విషయం బంతయు సవిస్తరంబుగా నివేదించుటయే కాక తుదవఱకును రాజుగారు మీ కండగా నుందురు. వారము దినముల లోపలఁ దమరు గురిజాలకు వచ్చి మత ప్రచారనిధి నుండి ప్రతిఫలముఁ బొందవచ్చును.

గురిజాల, } ఇట్లు,
పుష్య బ ౧౪ }

-♦ బ్రహ్మనాయఁడు ♦-

ఔరా! శైవమతవ్యాప్తికొఱకు నెట్టి ధర్మహానికైనను నొప్పుకొనుచున్నారే! పాపము పండినది. పోతరాజుగారూ! నిశ్చయముగా వారే యిందు దోషు లని నిర్ధారింపవచ్చును. కా— ని — లేఖలోఁ జేవ్రాలున్నయెడ నింకను స్పష్టతరమయ్యెడిది.

-* పోతరాజు *-

విపరీతసంశయంబులు ధర్మదేవతను గ్రుడ్డిదానినిగాఁ జేయుటకుఁ జాలియును. నే నిట్టిదని తమ రాగ్రహింపరాదు. మీ రెట్లు దోఁచినను నాయకురాలి ప్రోత్సాహంబున నరసింగరాజే విషాహారంబు పెట్టించినాఁడు. నిస్సంశయము.

-§ బాలచంద్రుఁడు §-

అవును. నిశ్చయమే.

కువిధుదౌష్ట్యవిక్రాంత్య కరుణల
గ్రూరకృత్యాచార త్రస్త
హీనదుస్సంగము మాఱుతోఁ గలిసి స్నే
హంబుల విశేషంబు కో
గళకోరత్వము దండిపోతుదన్న మే
కంబై దినో దించు నా
యకురాలిన్ — నరసింగు — స్నేహితులం దు
ర్వ్యాపారతారంగకుల్।

సమీపంబున నుండు కల్లు దుకాణంబు ప్రభావంబుచే మద్యపానదుర్వ్యసనంబునం బడి చెడిపోవు సామాన్యజనంబువలెనంతతము దుష్టకార్యాలోచనపరంపరలం దేలుచుండు నాయకురాలితో స్నేహించి నరసింగు వీధిపోకిరిగాఁ బ్రవర్తించుచున్నాఁడు. ఓరీ! నరసింగూ! ఎంత మాయానిపుణుఁడవైనావు! నాయకురా లెంత చెప్పిన నంత చేయు నీ దుండగంబు లంత ముగింతెను.

అల నలగామరాజునకు
నల్లుఁడు నీకును నల్లుఁడే గదా
తెలిసియు రాయబారము
బ్బాసు న త్యాలరాజుఁ జంపఁ జే
తు లెటుల వచ్చెరా! పరు
లుప్పుఁడె! శ్వాకుల వారి వార్థమై
కలిసిన తోకచుక్క వల
గర్వపు వీకుఁడ వీవు తుంటరీ!

అలరాజా సుకుమారమందుదన
స్వర్గ నిష్కళంక్య వీరా
ఙ్వాల వల్లభ బాలగొన్న నీ దురదు నీ
క్రూరాన్యుదు కృత్యకం
బుల పైరించఁడు బాలచంద్రుఁడు ప్రతా
పాదంబుగాఁ గోరిలోఁ
దల ఛేదించెను వచ్చి నీకు రిపుగ
కృత్యక్యకృష్ణరుబురన్.

నీ దురాత్మగమ లింక నెంత దలఁతో
నీ పాత్రి వైరంబు? తో
హో! దారిద్ర్యము లోన నుంటి మని యూ?
— అనాథ న్నసింహాంబ ఆ
ట్లే దుర్వారబలాఢ్యులం గొనుము; నీ
కేమ్యారుపా యుద్ధ?
హా దక్షోగ్రముదీయ భిక్షవిధల
జ్వాలావిదాహంబులన్.

ఓరీ! పాపీ! నరసింగూ! నాయకురాలితోడ నీవు గావించు స్నేహంబు నిన్నెంత పని సేయించినది! నలగామరాజు నీ కనుంగు సోదరుఁడే! అట్టి యన్నగారి కూఁతు మెడలోని మంగళసూత్రంబును ద్రెంపఁ బాల్పడిన నీ హృదయపారుష్యం బెంతి నింద్యాహ్యము! నీవు తమ్ముఁడవు గదా యని విశ్వసించి నలగాముఁ డెట్లు తన రాచతీరుపుఁ బునాదులఁ బెల్లగించుకొనుచున్నాఁడో లోకమునకు స్పష్టముగా దెల్లడియగుచున్నది. ఆ గాద్యవృక్షంబును బీల్చి పిప్పిఁజేయుచున్న పేలుపురుగు లగు నిన్నును నాయకురాలిని దొలఁగించినం గాని గురిజాలప్రజాక్షేమంబు గుదుటవడదు.

—♦ బ్రహ్మనాయఁడు ♦—

వత్సా! నరసింగరాజా!

కవనీయసంగీతకవితాకళాదుల
ధర్మతత్త్వజ్ఞాన శైథిల్యమెందు
అన్యభూముల మనకు మర్యాదలేదు
కాదుగద్దయుఁ బ్రజలకుఁ గౌరవమును
బద్ధనైక్యంబు బరమనిర్భాగ్య మైన
దారుణనికృష్టపారతంత్ర్యంబు దగదు.

—* బాలచంద్రుఁడు *—

వినుండు. వినుండు. తండ్రీ! మటొక్క మాట యాలకింపుడు.

—* బ్రహ్మనాయఁడు *—

(మఱలఁ జదువును)

అమితవిక్రమధురీణు లగు వీరులు పారతంత్ర్యంబున కిచ్చగింపఁ జాలరు.

—* బాలచంద్రుఁడు *—

తండ్రీ! అదిగో! ఆ చెట్టుపై నున్న పక్షి యెట్లు మనల స్వాతంత్ర్యప్రియులనుగాఁ జేయు చున్నదో!

" కులమా — పక్షికులంబె, మా
కపలం చీకుం జింతయుఁ లేదు, ని
త్యము స్వాతంత్ర్యవిలాసజీవితములన్
సాగించుచున్నాము వ
సుల మైనన్ — నరజాతివారు గదవి
గ్నం బొందరే" యంచుఁ గో
యిల గానం బొనరించు చున్న దదిగో!
యాలాత్తి వీక్షింపవే.

—§ బ్రహ్మనాయఁడు §—

అథఃపతనంబునం దున్న జాతికిఁ గాలపరిస్థితుల ననుసరించి సర్వేశ్వరుం డెట్లు ప్రబోధం బొనరించునో యట్లే మనకును నీ కోయిల తన కలగానముచే స్వాతంత్ర్యమాధుర్యంబును గూర్చి నొక్కిచెప్పుచున్నది. అహా! స్వరాజ్యం బెంత సౌఖ్యదాయకము!

కృతజ్ఞత్వంబును బూర్తిగాఁ దొలఁచు ని
ర్జీవత్వ మాటోపపవి
వ్యక్తపటం బైన మతప్రచారము న శా
కత్ కొట్టుఁ గాపాడు వే
కళ వ్యక్తిత్వము దేశరక్షణకళా
చాతుర్యవిజ్ఞానమా
తృవిధంబుల్ సమకూర్చి పెట్టును
స్వరాజ్యం బాత్మసంతృప్తిగన్

అట్టి స్వరాజ్యంబు నంపాదించు పట్ల నింక నే మాత్రం బలసత్వము లేక నిరంతరయుద్ధప్రచారంబు చేసి సేనానివహంబులకై ప్రజాసంఘంబులఁ బురికొల్పుటయే కాక యీ పలి కనేకయుద్ధంబులందు నాచే సహాయంబు నొందిన వారలతోఁ గలిసి మాట్లాడి వారి యంగీకారంబు వడసి వచ్చెదఁ గాక. మన గృహదైవం బగు చెన్నకేశవుండే న్యాయాన్యాయవిమర్శన మొనర్చి ధర్మపక్షంబునకు జయం బొసంగు నని భక్తుల మగు మన మెల్లరము విశ్వసింపవలసి యున్నది.

—* మల్లదేవుఁడు *—

మనము పోయి స్త్రీజనంబును గొంత యోదార్పవలసి యున్నది.

—♦ బ్రహ్మనాయఁడు ♦—

మంచిది, పోవుదము.

(తెరపడును)

## దృశ్యము 16.

### నాయకురాలి గృహము

నాయకురాలు — నరసింగరాజు మాట్లాడుచుందురు.

—† నరసింగరాజు †—

మాచెర్లరాజ్యములో సూది మోపు నేల యయినను మన మివ్వకుండుటచేత రాజు మన్న నా గ్రహించెడి ఖండంబునందలి కోపాగ్ని చల్లార విషాన్నదానసంవిధానం బనెడి సమిత్సమూహంబు నొక్కమాఱుగాఁ బైచి యుద్దీపింపఁ జేసినారము.

—* నాయకురాలు *—

మ్రాలమాదిగలతోఁ బూపికొని తిరుగుచు వారి యుద్ధరణమే ప్రపంచోద్ధరణముగా నెంచు పావుల విషయమై మన మెంత యక్రమముగాఁ బ్రవర్తించినను దోసము లేదు.

—♦ నరసింగరాజు ♦—

పల్లకి లోనిపాత్యవుఁగాగితముల కట్ట చేఁ జిక్కినది. కాని యా శైవులు విడిచి వచ్చిన మాట లోని యుత్తరము మాత్ర — మెంత చేవ్రాలు లేకపోయినను — చాలమట్టుకు మన గుట్టు బయలు వేయు నేమో.

—‡ నాయకురాలు ‡—

ఎందుకు! చారులు వచ్చి చెప్పిరిగదా నిన్నటిదనము బ్రహ్మనాయుఁడు గారు గూడఁ బూర్ణముగ మనమే దోషుల మని విశ్వసించిరఁట. అయినను నరసింగరాజుగారూ! మన మేమాత్రము భయపడ నవసరము లేదు. నలగామరాజుగారు బయటికిఁ గన్పడక పోయినను మతాభివృద్ధి విషయమై మన మెట్టిప్రయత్నములఁ గావించినను గాదనజాలరు. అలరాజు నెవరో వైష్ణవమతస్థులే హత్య గావించినా రని రాజుగారి చెవి వేసితిమి కావున, నతఁ డెట్లు నిజముగా హత్య గావింపఁ బడెనో మనముఁ వారి కెంతమాత్రముఁ దెలియనీయ రాదు.

—‡ నరసింగరాజు †—

అ దెట్లు చేయుఁగలము?

—† నాయకురాలు †—

పూర్వకథ లన్నియు నెట్లు నడపితిమో యిది కూడ నట్లే చేయవచ్చును. మొత్తము మీఁదఁ గొన్నాళ్ళ కయినను దెలియక పోదు లెండు. కాని కాలము గడచుట వలనను మఱో న్మాద ముంపుట వలనను, దెలిసినను, వారునోరెత్తఁజాలరు. అంతగా వారు లేఁగునట్లు తోఁచిన యెడలఁ దక్షణమే యా మంత్రిత్వమును విసర్జించి పోయెద నని బెదరింపఁ గలను. తగిన శైవమతోద్ధరణకర్తయును లేక, రాజ్యపాలననిర్వహణ సమర్థుఁడైన బ్రహ్మనాయఁడును దగ్గఱ లేక రాజుగారు కుడితిలోఁ బడ్డ బల్లి వలెఁ గలగుండువడరా! మన కా భయము లవసరము లేదు. మొదటినుండియు మన ప్రయత్నము లట్టివే. వారి యుదాసీ భావము నట్టిదియే.

—‡ నరసింగరాజు †—

అవును అంత యాగ్రహమైనను జూచి చూడనట్లు పోనియెడల శైవమతాభివృద్ధి యెట్లు సాగును!

—* నాయకురాలు *—

బ్రహ్మనాయఁడు తిరిగివంత వ్యవధి లేకుండనే యుద్ధసందేశ మంపినాఁడే.

—§ నరసింగరాజు §—

అది యెట్లు చూచినను మాటపలుకుబడి గల మనకే కాని యతని కంత లాభకారి గాదు లెండు.

—‡ నాయకురాలు ‡—

(ఎగతాళిగా) అట్లనెద రేల? రేపు కారంపూడి యుద్ధభూమి కెన్ని మాలపోతు మూఁకలఁ దెచ్చునో చూతుఁడు. ఆయన పంచమోద్ధరణోపన్యాసము లూరక పోవునా?

—* నరసింగరాజు *—

మాలపోతులలోఁ గూడఁ గొందఱు యోధులున్నారు గాని లెక్కకు లేదు.

—‡ నాయకురాలు ‡—

ఉన్న యుద్ధవీరులలో బ్రహ్మనాయఁడు, బాలచంద్రుఁడు, కన్నమదాసే యే మయిన వేరు

గలవారు. మిగిలిన వారి మాట లేల లెండు. అల రాజు మరణంబు వినిన యనంతరము కోపకషాయితుండై మండిపడి హంతకుండైన నరసింగ రాజు తల ఛేదింతు నని బాలుండు ప్రతిన పట్టెనని వింటిమిగదా. మన సొంత సమర్థతతో వారిని మార్కొని తృణప్రాయులుగాఁ బరికింపఁగల్గినను — పాము చిన్నదైనను బడితె పెద్దదిగా నుండ వలెనను న్యాయము ననుసరించి — ధూర్తుఁడగు బాలచంద్రునియెడ మనము జాగ్రత్తతోఁ బ్రవర్తింపవలెను.

—§ నరసింగరాజు §—

పోనీ యతనిని వీరమేడపి నుండి రాకుండఁ జేసినచో!

నాయకురాలు

అది మన మెట్లు చేయఁగలము?

నరసింగరాజు

దాని కొక యుపాయము ముందే యోచించితిని. తమతో మాట్లాడవలె ననుకొంటిని.

నాయకురాలు

(తనలో) ఎంత బీరంబులు పలుకుచున్నను నెవరి ప్రాణంబుపై వారికిఁ దీపిగదా (ప్రకా) అదేమి?

నరసింగరాజు

ఏ మందురా?

నాయకురాలు

చెప్పుఁడు నే గూడ వినియెదను.

నరసింగరాజు

కారంపూడి యుద్ధభూమికి రావలె నని బాలుం డువ్విళ్ళూరుచుండును గదా.

నాయకురాలు

అవును.

నరసింగరాజు

వీరో[illegible]లును గదలి యుద్ధభూమికి వచ్చుచుండుటచేత, "వీరమేడపిలోని స్త్రీజనం బొంటరిగ నుందు రని తలఁచి నరసింగరాజు సేనతో వచ్చి మేడపిని ధ్వంసముఁ జేయునట్టి కుట్ర గురిజాలలో రహస్యముగాఁ బన్నుచున్నా" రని బ్రహ్మనాయఁడు దగినంత రహస్యముగా గ్రహించునట్లు చేయవలెను. అట్లగుచో నాతల నఱకుటకై ప్రతిన పట్టిన బాలుఁడు నా సైన్యపు రాకకై వీరమేడపిలోనే కనిపెట్టుకొనియుండును. నేనుమాత్రము వీరమేడపికి బోను గద. బాలుఁ డక్కడనే యుండియుద్ధమునకు రాకపోవుట తటస్థించును. అతని రాకపోవుట నందుసేసికొని కారంపూడిలో మనము నిరోధిపక్షముపైఁ దగినట్లు విజృంభింపవచ్చును. బ్రహ్మనాయఁడు కన్నమదాసు యుద్ధభూమిలో నున్నా రనుకొనుఁడు అయినను మేటి వీరులలో నొకఁడు లేకపోయినను మనకు మేలే గద.

—† నాయకురాలు †—

(యోచించి నవ్వి) చక్కని యెత్తుగడ బాగుగా యోచించినారు. సరే. అట్లేచేయుదము (యోచించుచు) కారంపూడిలో యుద్ధము ప్రారంభింపఁగానే నరసింగరాజుగారు సైన్యముతో వచ్చి వీరమేడపిపైఁ బడుదురని గురిజాలలోఁ దిరుగునట్టివారి చారులకు రహస్యముగాఁ దెలియ నిచ్చిన యెడల వారు పోయి బ్రహ్మనాయనికిఁ జెవిని వేయుదురు ఈ మోసము గ్రహింపలేక మీరు చెప్పినట్లు బాలుఁ డచ్చటనే యుండును ఇ దంతయు వంచన యని బాలునికిఁ జివరకుఁ దెలియును. తెలిసి యప్పుడేమి చేయఁగలఁడు లెండు- యుద్ధము ముగిసియే యుండును.



—♦ నరసింగరాజు ♦—

అవును

—‡ నాయకురాలు ‡—

చక్కగా నున్నది నరసింగరాజుగారూ! మంచి యాలోచనముఁ జేసినారు వంచనాధిదేవతను గుఱ్ఱ(త్రహర్మ్యాగ్ర)మెక్కించి విహరింపఁ జేయుచున్నాము.

—‡ నరసింగరాజు †—

వారి చారులిప్పుడు గురిజాలలోఁ జాల మంది యున్నారఁటగదా. ఎవరికి నిది వంచనమని తెలియనీయరాదు. ఈసాయంత్రమే గురిజాలలో నచ్చటచ్చట మా చారులచే రహస్యముగా నావిషయము బ్రసంగింపఁ జేయుదము. అది విని గూఢప్రవర్తనులై యున్నవారి చారులు తత్క్షణమే వీరమేడపిలోఁ దెలుపుదురు.

—† నాయకురాలు †—

మంచిది, అట్లే చేయుదము.

—‡ నరసింగరాజు †—

కారంపూడికి మన ప్రయాణములు?

—* నాయకురాలు *—

రేపెల్లుండి యావలిదినమే కదా సేనిది. వ్యవధి యే మాత్రము లేదు. మనము కబురంపిన రాజులందఱును గారంపూడికి వత్తురో రారో తెలియదు.

—§ నరసింగరాజు §—

రాకేమి? తప్పక వత్తురు

—† నాయకురాలు ‡—

ఇఁకఁబోయి మన ప్రయత్నములు మనము చేయుదము.

—* నరసింగరాజు *—

మంచిది

(తెరపడును)





దృశ్యము 17.

కార్యంపూడి — నాగులేటి తీరము,

నలగామురాజు శిబిరము

నలగామురాజు నాయకురాలు ప్రవేశించుచుందురు.

—* నలగామురాజు *—

నాగమ్మగారూ! అపరిమిత వైశాల్యంబు గలిగి యతరుపర్వతాదిమధ్యంబై సమతలంబుగా నుండుటయేకాక సర్వవిధంబుల నీకార్యమపూడిలో నిసంగ్రామభూమి యెంత యుత్సాహోత్పాదనప్రదర్శనానుకూలంబుగానున్నది! ఈమనముందు పాఱుచున్న నాగులేఱుగూడ మిక్కిలి వెడల్పులేక యొకయుపనది శోభం బాల్చి కూలంకషంబై లేతకొబ్బరి నేటనీరు తియ్యందనంబు సధఃకరించు తన నిర్మల జలంబులందలి తరంగశిఖావిస్ఫురత్పరంపరలచే రోధస్థవృక్షపఙ్క్తిపాదంబులపైఁ బూలపూజ సేయుచుఁ జూపఱకు నేత్రపర్వంబై యున్నది. బ్రహ్మనాయఁడీ కారంపూడినే రణభూమిగా నేర్పుటమిగులశ్లాఘాపాత్రము. (దూరమునఁజూచి) అదే మచ్చోటు బహుజనాకీర్ణముగా నున్నది?

—* నాయకురాలు *—

రాజేంద్రా! అదినాగులేటిలో గంగధారయను పేరుగల మడుగు. అది సుప్రసిద్ధమైన పుణ్యస్థలమనియు నందాప్లావంబొనర్చువారు గతకల్మషులగుదురనియుఁ బ్రతీతి. అందు మన సైనికులు నిశేషసంఖ్యలుగా స్నానమొనర్చుచున్నట్లున్నది.

—* సేవకుఁడు *—

(ప్రవేశించి) అయ్యా! ధరణికోట రాజైన భీమదేవుఁడుగారి కొడుకు కోటకేతు రాజుగారంట వచ్చారు దర్శనానికి.

—* నలగామరాజు *—

తీసికొని రమ్ము.

—* సేవకుడు *—

(తీసికొనివచ్చి నిష్క్రమించును)

—* కోటకేతుడు *—

(ప్రవేశించి నమస్కరించును.)

—* నాయకురాలు *—

రండు. ఉపవిష్టులు కండు.

—* కోటకేతుడు *—

చిత్తము. (కూర్చుండును)

—* నలగామరాజు *—

శివపూజయైనదా?

—* కోటకేతుడు *—

చిత్తము.

—* నాయకురాలు *—

తండ్రిగారు గూడ భోజనముచేసి యుందురు గదా?

—* కోటకేతుడు *—

అవును. భోజనమొనర్చి ప్రయాణశ్రమవలన శయనించినారు.

—* నలగామరాజు *—

పోనిండు పెద్దలు (కొంచెమువుండి) తమరు మొన్నటిదినము బయలుదేరితిరి కాబోలు.

—* కోటకేతుడు *—

మా తండ్రిగారును సేనానాయకులు మూడుదినములక్రింద బయలుదేరిరి. నేను మాత్రము ముందే పయనమై తమ యాజ్ఞను బురస్కరించుకొని నాకు దెలిసిన యోధులలో గొండలు ఖేరు గల వాడి మగలు విజయవాడలోను గుంటూరు వినుకొండలలోను నుండుటచే వారలగూడ దీసికొని త్రోవలో కలిసికొనుచు యుద్దమునకు మా తండ్రిగారును, నేనును, సోదరులు కలసి వచ్చియున్నాము.

—* నాయకురాలు *—

గురిజాల ప్రభువులకు దా మొనర్చు సేవ నిరుపమానము.

—* కోటకేతుడు *—

అయ్యయ్యో! తమ రట్లనరాదు. ఇది యేమంత గొప్ప సాయము లెండు ...... కాని,—యన్నదమ్ములకే — యిట్టి కలతలు వానంగా గదా — యని — విచారము.

—* నాయకురాలు *—

మన మేమిచేయగలము! ఈశ్వరసంఘటనము.

—* కోటకేతుడు *—

(తలయూచి) ఆహ్వానమంపినవారందఱును దమ తమ దళంబులతో వచ్చి విడిసియున్నారుకదా?

—* నాయకురాలు *—

లే దింకను కొందఱుండి రావలయును. యుద్ధోపక్రమణదినమున కింకను రెండుదినములు గడువున్నది గద.

—* కోటకేతుడు *—

ఇప్పు డెవరెవరు వచ్చినట్లు?

—* నాయకురాలు *—

ద్వారసముద్రాధిపతియగు వీరభల్లాణుడును, గుడిమెట్ట కేలికయగు నాగినోత్రరాజును జంతవోలు కొవట్ల చుట్టుప్రక్కల ప్రదేశమయిన వెలనాటిలో సింహాసనమధిష్ఠించియున్న గజేంద్రచోడుడును, నురగసేన ప్రభువర్యుండును, వీరే గాక మాడుగుల వీరారెడ్డి మొదలగు యోధాగ్రేసరులును వచ్చి విడిసియున్నారు. చందోలు నృపాలుండును నొక రిద్దఱు యుద్ధవీరులును నింకను రావలసియున్నారు.



—* కోటకేతుడు *—

వారిదై పు?

—* నాయకురాలు *—

రాజు లొక రిద్దరు దప్ప లేరు

—* కోటకేతుడు *—

రాజులు లేకపోవచ్చును. యోధులు మాత్రము చాలమంది వచ్చినారని వినినాను.

—* నాయకురాలు *—

అవును. దెబ్బదినుపడిపోబడిన కండు కన్నమనాయుడు నలరాజు చావుచే పగవుచచ్చి మాచర్లలో దీసుకొనుచున్న కొమ్మరాజు మొదలగువా రున్నారు.

—* కోటకేతుడు *—

కన్నమనాయు డెవరు?

—* నాయకురాలు *—

బ్రహ్మనాయని కావమఱిది పైన బాలచంద్రునికి బిల్లనిచ్చినమామ

—* నలగామరాజు *—

వీరు లా వైపు లే రనెదరేల? నగ్గాల కోటిలింగము, ముతసాని కొచ్చిరెడ్డి, గోవిందుల కాపినీడు, పైడిచుక్కల ముత్యాలు, సంపెట నారన్న — వీరుగాక పెనుమాలవారను వీరులు — నిం కెందఱెందఱో యున్నారు. అందఱను దలదన్నిన కన్నమదా సున్నాడు. ఇక వీరాధివీరుండగు బ్రహ్మనాయనిసంగతి జెప్పనక్కఱలేదు గద. అదృష్టవశంబున బాలచంద్రుడును దత్సేనహితులు మాత్రము రాలేదు. వీరమేదపి సంరక్షణార్థం బుంచినారని నాగమ్మగా రనుచున్నారు.

—* నాయకురాలు *—

బాలచంద్రుడు వచ్చిన మాత్ర మేమిలెండు ఇక్కడ నంత చేతగానివా రెవరు? అయినను నలరాజు మరణవార్త వినిన యనంతరము సభలో గురిజాలపై దండెత్తుచు నేరము నాపైనను నరసింగరాజుగారిపైనను మోపి శిరశ్ఛేదము గావింతునని యుత్తరకుమారప్రతిజ్ఞ లేడ్చిన బాలుడు రాకుండుటకు గారణ మేమున్నది!

నరసింగరాజును బాలుండు శిరశ్ఛేదం బొనరించు ప్రతిజ్ఞయే కాక నన్నుగూడ యుద్ధంబున బట్టి బంధింతునని బ్రహ్మనాయని ముద్దులకొడుకు — ఆ మాలగుంటడు — కన్నమదాసు శపథము బట్టినాడట. చూచెదముగాక యీ కుక్క ముంకల ప్రతాపాతిశయములు.

—* కోటకేతుడు *—

ఈ నాటికి బరిస్థితు లిట్లు మారినవి కాని లేకున్న యీ రెండు కుటుంబములకు గల పరస్పర సంబంధంబను వృక్షంబు పదులకు నిలువ నీడనిచ్చుచు నెంత ఫలవంతమై విరాజిల్లుచుండవలసినది! విధియనుల్లంఘ్యము.

—* నలగామరాజు *—

యథార్థము (కొంచెముండి) కోటకేతుడుగారూ! (రహస్యముగా) మనలో మాట. మన వైపు వీరులసంఖ్య విస్తారముగా లే దట్లగునా యని యించుక విచారము గలుగుచున్నది. అయినను దమబోం ట్లున్నారనుకొనుడు కాని లోపము లోపముగానే యుండును.

—* కోటకేతుడు *—

నాగమ్మగారికి గోపము వచ్చునేమో రథగజతురగ సైన్యంబులు మనకెక్కువకలవేమో కాని పదాతిజనంబులు మాత్రము మనకంటె వారికి వేయిమడుంగు లెక్కువ. రాజుగారూ! ఈ పూట వారిపక్షంబున వచ్చిన మాలమాదిగలు గల కాలిబంట్లు సంఖ్యాతీతు లనుకొనుడు. నిజముగా నట్టి సేనానివహంబుల జూచి నాకు గుండె బ్రద్దలయి

తని నమ్మకము.

-॥ నలగామరాజు ॥

అవును నిజమే

-॥ కోటకేతుడు ॥-

కాని యొకటి. బాలచంద్రుడు మాత్రము యుద్ధమునకు రాలేదు.

—॥ నాయకురాలు ॥—

వీరులందరిలో నతడొకడు. అతడేమి బ్రహ్మనాయకుడా? వీరలిట్లు బేలలై ప్రసంగించుచున్నారు గాని నా కణుమాత్రి మధైర్యము లేదు యుద్ధము ప్రారంభ మెల్లుండిగదా ఇంకను రాజులును. సైన్యములును రావచ్చును. ఇంతలోనే యధైర్యపడనేల?

॥ సేవకుడు ॥

(ప్రవేశించి) అయ్యా! దండాలు. చంద్రగిరి రాజుగారు పంపించారంట సైన్యం వచ్చింది.

నాయకురాలు

మంచిది

-॥ కోటకేతుడు ॥-

నాగమ్మగారు చెప్పినట్లు మన మిప్పుడే యధైర్య మొందుటేల? నేడు రేపు సింకెవ్వరు వత్తురో చూచెదము. అప్పుడే స్వపక్ష పరపక్ష బలాతిశయంబులు జూచి విచారించుకొన వచ్చును.

-॥ నలగామరాజు ॥-

అవును. ఆ వచ్చిన సేనలయు సేనాధీశులయు యోగక్షేమంబు లరసి వత్తురా నాగమ్మగారూ!

నాయకురాలు

చిత్తము. (నిష్క్ర)

-॥ నలగామరాజు ॥-

కోటకేతుడుగారూ! పెద్దలగు మీ తండ్రిగారినిదర్శించిచాలకాలమైనది.రండుమీశిబిరమునకు

కోటకేతుడు

మంచిది.

(ఇరువురునిష్క్ర)

దృశ్యము 18

దోర్నీడు ప్రవేశము.

-॥ దోర్నీడు ॥-

అందరూ యుద్ధానికి పోవడంచేత వీరమేడపి అంతా బావురుమంటున్నది. కారంపూడిలో యుద్ధము నిన్ననే మొదలుపెట్టుండాలె. బాలచంద్రునికీ అతని స్నేహితులకు మాకూ యింకా కారంపూడికి బోయే అదృష్టం పట్టలేదు. ఆ నరసింగరాజు వచ్చేమార్గం కనపడలేదు. లేకపోతే మనం కారంపూడికి రాకుండా చెయ్యటానికి నాగమ్మ పన్నిన పన్నాగమా యిది అని బాలచంద్రుడు అనుమానిస్తున్నాడు. ఈ సాయంత్రము గూడా చూస్తాడు. రాకపోతే యిదంతా మోసమనే అనుకొని రేపు కారెంపూడి దూకుతాడు. ఊరుకోడు. పులిపిల్ల. బహు కచ్చమనిషి. (యోచించి) ఓహో! నరసింగరాజు రాకపోయినా సరే మేడపిని కాస్తుండమని కదా బ్రహ్మనాయుడుగారి యుద్దేశ్యం. ఇకను ఈన కారంపూడి యెట్లా వెళ్తాడబ్బా? అయినా మాట్లాడుదాం. ఏదీ తోచక అతను బొంగరా లాడబోయింది ఆ తోపులోనే గదా. పోయి... ..(వినుటనభినయించి) ఆ పోతున్న వా ళ్లేమో అంటున్నారే నన్నుచూశి

(తెరలో)

కోమటి అన్నమ్మ కాలికి మీ స్నేహితుడు బాలయ్యగారి బొంగరం దగిలింది. ఆమె యేడుస్తూ అయన్ను తిడుతున్నది. పోండి. తప్పునబోండి.

-॥ దోర్నీడు ॥-

అరెరే! తిట్టుబోతయిన అన్నమ్మ కాలికే తగిలిందే. త్వరగా బోదాం.

(నిష్క్ర)

దృశ్యము 19

మామిడి తోపు — బొంగరా లాట.

అన్నమ్మ కాలు పట్టుకొని కూర్చుండును. బాలచంద్రుడామె కాలి దగ్గర గూర్చుండి యుండును. అతని స్నేహితుడు దోర్నీడు గూడ నుండును.

—॥ బాలచంద్రుడు ॥—

అమ్మా! బుద్ధిపూర్వకముగా మాత్రము తమ చరణంబునకు హాని గలిగింప నెంచలేదు. ఇది నే నన్ని సార్లు నొక్కి చెప్పుచున్నను దమరు నాయందు గరుణాదృష్టి చిత్తలు గాలేదు. ఇది నా దురదృష్టము.

-॥ అన్నమ్మ ॥-

(ఏడ్పుగొంతుతో) నీ దురదృష్ట మేం కమ్మం నా దురదృష్టమే కాని. ఆయిగా ఎండలో పేడ బోగుజేసుకోక యిట్టా వచ్చి అడ్డమయిన వాళ్ళ చేతా దెబ్బందుకు దింట్నాను. నా కమ్మం నా పాలుద్దం. పైగా బుద్ధి పూర్వకంగా కొట్టలేదంటావ్? (మెటికలు విరుస్తుచు) నీ దుంప దెగ. నీ చెయ్యి బడ. ఇయ్యాల ఎవరి ముగం సూశానో కాని నీ యింటి నాపిట్టోడి కాళ్ల కాలిరిగింది. (నొప్పితో) శ్స్. అమ్మా! నీ జిమ్మడ. ఎంత దెబ్బ గొట్టావురా. నీ బొంగరం నువ్వూ పూడ్చుకుపోను. ఎయ్యాల్టికి యేకాళ్ళు. [illegible] నాకే యెందుకు తగుల్తుంది?

—॥ బాలచంద్రుడు ॥—

అమ్మా! అల్లనుట పాడి గాదు. బొంగరాలాట చూడ వచ్చిన వారు రెండుమూడు వందల జనమునకు దక్కువ యుండరు గదా. ఇందరిలో మీపయి మాత్రము విరోధించుటకు దగినంత కారణ ముండవలెను, అట్టి కారణ మేమియు లేదని సర్వసాక్షి యైన భగవంతుడెరుగును.

-॥ దోర్నీడు ॥-

అవు నిందరిలో నీకే హాని జేయుటకు దగినంత కారణ మేమున్నది?

—॥ అన్నమ్మ ॥—

నువ్వొచ్చా నాయనా యిక్కడ! చీరంగనీతులు జెప్పవచ్చావోరు మూచుకు గూచోక! తనూ ఒక పెద్దమంచల్లే చెప్పవచ్చాడు. సాకలోళ్ళబ్బాయివే. ఉద్యోగం చేసుకోకుండా పెద్దోళ్ళను యిడిసి పెట్టి యీపోలగాశి నుట్టూ తిరుగుతావు! దిగ్గ లేదూ?

—॥ దోర్నీడు ॥—

అదిగా దమ్మా!

—॥ అన్నమ్మ ॥—

సాలుసాల్లే రా సాకలెదవా! కొట్టడాని కేం కారణముండాలెరా? కొంతె శెట్టలకు కారణమేంది? కొంటె పిల్లోళ్ళు కనపడ్డ వాళ్ళ నల్లా కొడ్తారు. అళ్లకేం మాయరోగమా? తింటారు పుల్బలో ముక్కల్లే తెగదిరుగుతారు. దున్నపోతులల్లే దిని తెగబల్సి కొట్టుకుంటున్నారులే అంతా. ఈ సాకడు ద్దొరికాడు నాయకుడు మీకు.

—॥ దోర్నీడు ॥—

ఏదీ యిప్పు డన్నమాటలు మళ్ళీ అను. తల చెండేస్తాను (అని కత్తి యెత్తును)

—॥ బాలచంద్రుడు ॥—

(వారించి)

అమ్మా! పొరపాటున నపరాధ మొనర్చితిని బాలుడను. నా తప్పు క్షమించి శాంతము

వహింపుఁడు. నే జెప్పికొనవలసినది చెప్పినాను. పిమ్మటఁ దమ చిత్తము.

—† అన్నమ్మ †—

నువ్వు బాలుఁడవా? బుచ్చెబ్బాయివి పాపం. నీకేం తెల్సు. నోట్లో వేలుపెడితే కొరక లేవు. నేతిబీరకాయవు. పేరుకు మాత్రము బాలుడవు. బ్రెమ్మనాయుడుగారూ వారంతా యుద్ధానికెళ్తూ యిక్కడ నిన్ను దిఁ చిపోయింది యిందుకే కామాలె. అల్లాతో బోయి యుద్ధం జేయలేక "ఎవడో వస్తాడు సంపు" ల్నని వంక బెట్టుకొని గాజుల్తొడిగించుకొన్న ఆడదానల్లె యింటో కూకున్నావ్! ఊరు ఉంట యూరుకు ఆడదానికంటె కనాకట్టం.

—* బాలచంద్రుఁడు *—

(చివాలున లేచి కత్తి నూడఁబెఱికి) ఏమీ! ఏమంటివి! వైరిసైన్యసంరంభంబున కాగలేనని తలంచియా నేను యుద్ధరంగంబున కందఱితోఁబాటు పోకుంటిని? ఈ వాక్యము స్త్రీ నోటి నుండి వెలువరింపఁబడుటచే మిన్నకుంటిని గాని పురుషుం డెవ్వండైనను గడకుఁ బ్రాణమిత్రుం డైనను హృదయశల్యాయమానం బయిన యీ పలుకుఁ బలికిన యెడల మదీయఖడ్గవిక్షేపంబునఁ దదీయశిరంబు పరిత్రుటితం బొనర్చియుందును. ఈ మేనపి లోని పౌరు లందఱు నిట్లే యపోహంబులం బోవుచుండిరేమో కదా! ఎంత పాపము! ఎంత ఘోరము! ఎంత కర్ణకఠోరంబైన యపవాదవాక్యము నేఁడు వినవలసివచ్చినది! అగణ్యశ్రీమంతుఁడును నిఖిలాంధ్రరాజ్యంబునందే కాక పరరాష్ట్రంబులందుఁ గూడ విఖ్యాత వీరులందఱకును నిరుపమాన పౌరుషభిక్షం బెట్టి దేవతాప్రస్తూయమానుండై వీరాధివీరుండని యనేకయుద్ధంబుల విజయలక్ష్మిచేఁ గరపత్రంబులం గొనిన బ్రహ్మనాయనికి గాఁబుట్టినై విరోధిజనంబుచేఁ గూడ నిశ్చయబుద్ధిచే సింహకిశోరం బని పిలువంబడుచు నిరంతరము సకలజనజేగీయమానుండనై బాల్యం బాదిగ మనస్సును వీరవిక్రమకథాసైకతస్థలులఁ గ్రీడింపఁజేయుచున్న యీ బాలచంద్రునికా — యీ యసమానదోర్బలవిజృంభణతృణీకృతవైరివీరాగ్రేసరునికా యుద్ధభీతి! ఎంతమాట! ఈ పరుషభాషణము నా హృదయంబును గలగుండు పఱచుచున్నది. ఇంక నే నోర్వఁజాలను మా యిలువేల్పు గుణ్ణస్వామీ! చెన్నకేశవా!

అతిమాత్రంబగు నా పరాక్రమము మీ
యాహా! లోకులీక్షించ నీ
గతి' నాడంగలచేత దూషణకళా
ఘాతంబులం బొందె నా
మతి ఘోషించెడు నస్త్రజీవినయి యి
ట్లాడ్కొనఁ బృథాకాలయా
పత్రపం బెందితిఁ — తప్పుఁ జేసితిని —
పాపంబు సైరింపుమా.

దోర్కిఁడూ!

అసమోదగ్రమదీయ సంస్థిమిత
కార్యాఖిలసంగ్రామసా
హసభారం బను మందు పాఱిఱకు
ని ష్పంటించె నన్నమ్మ క్రూ
ర్య సమేతంబను శతఘ్నిరాజఘన సై
న్యం బెల్ల నిర్దగ్ధమై
యనువుల్ గోల్పడుఁ గాక నింక మన
పానంద మువ్పొంగఁగన్,

(అన్నమ్మ భయముతోఁ దొలగిపోవును)

—* దోర్కిఁడు *—

అన్నయ్యా! యుద్ధానికి బోతావా యేమి?





—§ బాలచంద్రుఁడు §—

అవును నిశ్చయముగాఁ బోవుదును.

—§ దోర్కిఁడు §—

పొరపడుతున్నావు

—§ బాలచంద్రుఁడు §—

ఎట్లు?

—• దోర్కిఁడు •—

వారంతా బోతూ నిన్నిక్కడ విడిచిపోయినారు గదా?

—§ బాలచంద్రుఁడు §—

నరసింగు వచ్చునేమో యని కదా విడిచిపోయినది. అఁతే ఇప్పటివఱకును రాకుండుటచే యుద్ధభూమికి నేను బోకుండుటకై విరోధులు మోసము పన్నినా రని సందేహించుచున్నాను.

—‡ దోర్కిఁడు ‡—

అది గాకపోయినా మేడిపి గోనే వుండి కాపుకల చేస్తుంటావాలె నని కదా వారి యుద్దేశం.

—† బాలచంద్రుఁడు †—

దోర్కిఁడూ! తండ్రిగారి యభిప్రాయమూ జ్ఞకాక పోయినను నన్నుల్లంఘ్యమని నాకుఁ దెలియును. కాని విపరీతపరిస్థితు లావహిల్లినవు డట్టి ధర్మంబులలోని నైర్మల్యంబును మన మంతగాఁ బాటింప నక్కఱలేదని నా మతము.

—‡ దోర్కిఁడు ‡—

(నిదానించి) ఏమో! నీ భావం సరిగా తెలియడంలేదు. మొత్తము మీద యేవో కొత్త ధర్మాలు పుట్టిస్తున్నావు.

—§ బాలచంద్రుఁడు §—

దృష్టాంత సహితముగఁ జెప్పుచున్నాను. వినుము. అసమానబలుం డగు నర్జునుండు మున్నొకప్పుడు తన గాండీవంబు గూర్చి తిరస్కార వాక్యంబు లెవఁ డాడునో యట్టి వాని శిరంబు ఖండింతునని శపథం బొనర్చియుండెను. కౌరవపాండవయుద్ధంబున కృష్ణార్జునులు దగ్గఱ లేనప్పుడు కర్ణుం డొకనాఁడు ధర్మరాజును జుట్టుముట్టి బాణపరంపరాసంవిహితుం జేసి శరీరంబున రక్తధారలవిరళంబుగ స్రవింపం జేయ నతండు శిబిరంబునకుం బోయి తపించి తమ్మునిరాక సన్నిధిం జేరవచ్చిన యర్జునుని — కర్ణుం డింకను జావకపోయెఁ గదా యను సమశయంబున — ననగాని మాట లాడి యాతని గాండీవంబును గూడ దూషించెను. పూర్వము గావించిన శపథము ప్రకార మర్జునుఁడు ధర్మరాజశిరంబు ద్రెవ్వనేయ నుద్యుక్తుండు గాఁగా జగన్నాటకసూత్రధారి యగు శ్రీకృష్ణభగవానుం డడ్డపడి సమయానుకూలధర్మోపన్యాసంబు గావించి యా దుష్కార్యంబు నుండి యతనిని మాన్పించెను. శపథము ప్రకారము ధర్మరాజును జంపియుండవలసినదిగదా. అట్లే జరిగి యుండిన యెడల ధర్మరాజ మరణము, ధనంజయుని మనస్తాపము, మనోవైకల్యము మొదలగున వన్నియు సంభవించును. యుద్ధ మాపవలసివచ్చును. దుర్యోధనాదు లనెడి భూభారం బట్లే నిలిచియుండును. ఇ వన్నియు నాలోచించియే శ్రీకృష్ణుండు విపరీతపరిస్థితులందు ధర్మచ్యుతికిఁ గొంత యవకాశము గల్గించియున్నాఁడు. మఱియు నొక్క దృష్టాంతము. పూర్వ మొకనాఁడు కొందఱు బాటసారులు ప్రోవం బోవుచుండఁగాఁ జోరులు వారిని వెంబడించిరి. ఒకచోట నొక ఋషి కూర్చుండియుండ బాటసారు లాతనిసమ్ముఖంబున నున్న పొదలోనికిం బోయి దాఁగిరి. చోరులు వచ్చి ఋషిని ప్రశ్నింపఁగాఁ దనకుఁ దెలిసిన విషయమే కావున నసత్యమాడరాదని యెంచి పొదలో నుండి రని నిజముఁ

కుని జూచి) అన్నగారి సేవకు డొస్తున్నాడే కారం పూడి నుంచి

-† సేవకుడు †-

(ప్రవేశించి) బాబయ్యా! దండాలు

-† బాలచంద్రుడు †-

ఏమి?

-† సేవకుడు †-

అన్నయ్యగా రుత్తరం పంపారు (అందిచ్చును.)

-† బాలచంద్రుడు †-

(చదువును)

"చిరంజీవి తమ్మునికి,

నరసింగు వీరమేడపి పైకి వచ్చు నని వారెంత గూఢముగా వెల్లడించినను నది నీవు రాకుండుటకై కావించిన వట్టి మాయోపాయ మని తేలినది. అతని నిక్కడనే గుడారములలో దాచియుంచిరి. కనుక నీవాలస్యము చేయక పయనమైరమ్ము. మొదట వీరమేడపికావుదలఁ గూర్చి యనుమానించినను దండ్రిగారు నీ విక్కడకు వచ్చుటకుఁ జివర కంగీకరించినారు. తక్షణమే రమ్ము.

ఇట్లు,
కన్నమదాసు"

-† బాలచంద్రుడు †-

(ఆశ్చర్యముతో) ఎంత మోసము!

-† దోర్నీడు †-

అనుకున్నంత యిందే!

-‡ బాలచంద్రుడు ‡-

తమ్ముడా! రమ్ము పోవుదము.

(అందఱు నిష్క్రమింతురు)

దృశ్యము ౹౦
నాయకురాలు ప్రవేశము.

-‡ నాయకురాలు ‡-

నరసింగరాజు నెంత దాచియుంచి బయటికిఁ గన్పడకుండఁ జేసినను శత్రువు లెట్లో పసిపట్టి — యి దంతయు బాలచంద్రుఁడు యుద్ధభూమికి రాకుండుటకై మేము చేసిన మోస మని — యూహించి యీ విషయము మేడపికిఁ గబురునేసిరి అందుచేతనే యీ యుదయము బాలచంద్రుండు వీరమేడపి నుండి తన స్నేహితబృందంబులతో వచ్చి విడిసియున్నాఁడు. కలిత మగఁటిమి గలజోదు లకుఁ గూడ నించుక భయోత్పాదన మైనట్లు వినుచున్నాను. నిన్నటిదినము బ్రహ్మనాయఁడు చూపిన రణపటిష్ఠత మాత్రము నిరుపమాన మని చెప్పక తప్పదు. అప్పడే సైన్యము నాల్గవవంతైనను బ్రహ్మనాయని క్రోధాగ్ని యెదుట మాడి మశాన మయినది. వచ్చిన రాజన్యులలో ననేకులు మాచెర్లరాజ్యము వారి కిచ్చుటయే న్యాయ మని పల్కుచు ప్రబోధించుచుండుట వలనను బాలచంద్రుండు నరసింగును శిరశ్ఛేదంబు గావించు నను కొని కలంతవడిన కొందఱి యపోహంబుల వలనను నాకు మఁన్ను మనస్సులో లేకున్నది. పోరాటము పట్ల మాత్రము ధైర్యంబు నాకుఁ గించిత్తైనను సడలకున్నను వచ్చిన రాజమిత్రుల యొక్కయు వారి యొత్తిడి గల నలగామరాజుగారి యొక్కయు యుద్బోధనముల వలన వారికి రాజ్యం బిచ్చి సంధి గావించుకొనవలసివచ్చు నేమో రాజ్యంబు పట్ల నెట్లున్నను మతివిషయంబున మాత్రము లొంగఁడలఁచుకొన లేదు. (చూచి) అరుగో! ధరణికోటయువరాజుగారైన కోటకేతువు గారు సంధ్యుద్బోధనమునకై మఱల నాకడకు వచ్చుచున్నారు.

-‡ కోటకేతుఁడు ‡-

(ప్రవేశించుచు.) నమస్కారము. నాగమ్మగారే మాలోచించిరో తెలియలేదు.

-§ నాయకురాలు §-

అల్పవయస్కులయ్యును ననన్యప్రతిభాశాలులగుటచేఁ దమరుమాకుఁ బూజ్యులు. పెద్దల మాట కెదురుసెప్పఁచున్నానని దురభిప్రాయపడవలదని మనవి.

-§ కోటకేతుఁడు §-

మీకును వారికిని దగిన పరిచయంబు గలవాఁడ నగుటచే రెండు పక్షంబుల శ్రేయంబును గోరి "యుద్ధమాపి సంధికిం బూనుఁ" డని హెచ్చరించుచున్నాను. యథార్థ మాలోచించిన వారి రాజ్యము వారికీ వలసినదే కదా. ఇట్లు మిమ్ము సంధికిఁ బురికొల్ప నిశ్చయించినది నే నొక్కఁడనే కాదు. వీరభల్లాణుఁడు మొదలగు వారు గూడ నున్నారు గదా. యుద్ధ మాడలేక శరీరము దాఁచుకొనఁ దలఁచి యి ట్లనుచున్నా నని గ్రహింపవలదు.

-† నాయకురాలు †-

కొంత మట్టుకు యుద్ధం బొనర్చి సంధికిఁ బూను నంతటి దురవస్థ యీ పక్షంబున కేల పట్టినదో తెలియకున్నది.

-† కోటకేతుఁడు †-

నేను వచ్చిన తొలిదినంబునుండియు నంధిప్రేరణము గావించుచునే యున్నాను. నలగామ రాజుగారికిఁ గొంత నచ్చినది. తమ యభిప్రాయంబులు మిక్కిలి సంభావ్యము లగుటచే నిన్ని సారులు లోకక్షేమము గోరి యీ విషయముఁ దమతో నెత్తవలసివచ్చినది మాచెర్లరాజ్యంబు వారి కిచ్చివేయుట న్యాయమనియు, నన్నదమ్ముల కయ్యము శ్లాఘాపాత్రము గాదనియుఁ బెద్ద లందఱు దలఁచుచున్నారు. అదిగాక మన సైన్యంబు కొంత వఱకుఁ బలహీనమయినదని కూడఁ దమ రొప్పుకొనవలయును.

—* నాయకురాలు *—

క్రొత్త సైన్యంబులకుఁ గబురంపితిని గదా.

—♦ కోటకేతుఁడు ♦—

ఎన్ని క్రొత్త సైన్యంబులు వచ్చిన నేమగును బ్రహ్మనాయని ధాటిముందఱ! నాగమ్మగారూ! నిన్నటి దినము

యుద్ధవిరామఘంటవఱ
చూపిరిఁ బ్రదిప్పఁగనీక శత్రురా
డ్బద్ధవిరోధ మూనుచుఁ గృ
పాణకృతాంత నితాంత పాళముల్
గుద్ధదళంబుపైఁ బఱపి
గుండెల దోసిటఁ బెట్టుచున్న శౌ
ర్యోద్ధతు బ్రహ్మనాయని జ
యోన్నతు నాపె నెవండు చెప్పఁడీ.

మఱియు

మన సేనానివహం బునిర్ల గతి న
స్త్రాల్వీరులం జుట్టుము
ట్టిన వేళన్ నవుటాల కవ్వఁడో — యతం
డే బాలచంద్రుండు వ
చ్చె — ననన్ గాలికి బుద్ధి సెప్పిన దళ
ప్రశ్రేష్ఠంబులతో యుద్ధ మే
మని కావించెద రింకఁ — బ్రజ్ఞలకుఁ జే
యంబోలు నే కయ్యముల్?

-‡ నాయకురాలు ‡-

మీ కందఱకును నందులో నలగామరాజుగారికిని సంధి యవశ్యాచరణీయముగాఁ దోఁచు

చున్నప్పుడు నేనడ్డు రాఁగూడదు. సరి కానిండు. అట్లయిన సంధిసూత్రము లేమని?

—‡ కోటకేతుఁడు ‡—

మాచర్ల రాజ్యము వారి కీవలసినదనియే. దీనికి గుణవంతుఁడైన బ్రహ్మనాయఁడు గతంబు మఱచి తప్పక యొప్పుకొని తీఱును.

—‡ నాయకురాలు ‡—

మిగిలిన వారందఱు?

—† కోటకేతుఁడు †—

వారిని నాయఁడుగారు మందలించి యొప్పింతు రనుట సత్యము. అట్లుగాక, మాచెర్ల రాజ్యము నిచ్చుచున్నను మొండిపట్టు విడువక యలరాజు హత్యకుఁ బ్రతిహత్య గావింపఁదలఁచి నరసింగరాజును శిరశ్ఛేదంబు సేయ నెంచి బాలచంద్రుఁడు మొదలగు వా రొప్పుకొనక యుద్ధోన్మత్తులై యుండిరేని యప్పుడు ధర్మదేవత మన పక్షంబున నుండుఁ గాన నొక్క కబురంపితిమా యాంధ్ర దేశములోని తక్కుంగల రాజన్యులు గూడ మన పక్షంబున వచ్చివిక్రమింతురు. నిజంబుగా నరసింగే శిరశ్ఛేదితుండైన యెడలఁ — బ్రాణంబుల కాసింపక రణసాహసంబు సూపించి దారుణంబైన ప్రవిదారణంబున నా గుంటను బాలచంద్రుని నని మిషాశ్చర్యాపాదకంబుగా యుద్ధంబున బలి దీయక విడుతుమా! బాలచంద్రుని జూచి భయం పడుచున్నా మని మాత్రము గ్రహింపఁజనదు. "వారి రాజ్యము వారికిచ్చివేయుట న్యాయము గాదా — అనవసరంబుగా నీ కయ్యమేల" యని విచారించుచున్నాము గాని వేఱొండుగాదు.

—§ నాయకురాలు §—

రాజ్యభాగంబు మాట యెట్లున్నను మత విషయంబున మాత్రము లొంగఁ దలంపలేము. దేశం బంతయు మాలకూటముఁ జేయుచున్న బ్రహ్మనాయని నింకను గౌరవోత్కర్షముతోఁ జూడఁగలమా? ఇట్టివైష్ణవమతప్రచారము విరమించుకొనుట సంధిసూత్రములలో నొక్కటై యుండిన గాని నే నంగీకరింపఁజాలను. నలగామరాజుగారు గూడ శైవమతవ్యాప్తివిషయంబున రాజ్యప్రాణంబులఁ గూడ లెక్కగొనక ప్రవర్తింతురు గాని యన్యథాకరింపరు.

—§ కోటకేతుఁడు §—

సరే. వారితోఁ గూడ మాట్లాడుదము రండు.

(తెరపడును)

(తెరలోఁ జాటింపు)

ఈపూట యుద్ధం లేదు. కోటకేతువుగారు యీరులందఱితో మాట్లాడుతారు. సాయంతరము సభ కంతా రావల్సిందని మల్దేవరాజుగారి ఆజ్ఞ అయిందోహోయ్ (డప్పువాయించుట వినఁబడును)

## దృశ్యము 21
## కోటకేతువు ప్రవేశము

-§ కోటకేతుఁడు §-

(తనలో) మాచెర్ల రాజ్యము వారి కీయకుండుట యన్యాయమని యెఱిఁగి యన్నదమ్ముల పోరాటము సమంజసము గాదని తోఁచి మనస్సు సంధికై వీకులాడుచున్నది. పరిపాలననిర్వాహణకారణముల వలన నలగామరాజుగారి యాహ్వానము నాజ్ఞఁ బురస్కరించుకొని నేను వచ్చునప్పుడు నాతోఁ గూడఁ గొందఱు వీరులఁ దీసికొనివచ్చితిని. నాతోఁ బాటు మిగిలిన పెద్దలను గూడఁ బ్రోత్సహించుచు బ్రహ్మనాదుల బలాతిశయంబు కనులకుం గట్టినట్లు వర్ణించుచుఁ దోలుకవచ్చితివే కాని మఱల నే సైన్యంబులు రాకుండుటచే నెట్లో మాచెర్ల రాజ్యము యథాపూర్వము వారి కిచ్చివేయునట్లొప్పించితిని. నాగమ్మగా రెంత ధీరోక్తులఁ బ్రసారించినను బాలచంద్రుని గంభీరప్రతాపాతిరేకంబుతోఁ బాటు ప్రతిజ్ఞాపరిపాలనదీక్ష యెల్లర నెఱింగి యుండుట వలన వాస్తవముగానే నరసింగుతలఁ దెగవేయుటకుఁ బ్రయత్నించునని నా కనుమానంబుండుటచేత — వారి రాజ్యము వారికిచ్చుటయే కాక మత ప్రచారవిషయంబందును గొంచెము సడలువిడువుఁడని నే నెంత నొక్కిచెప్పుచున్నను ముఖ్యముగా నాగమ్మగారే మాత్రము లొంగకున్నారు. మాచెర్ల రాజ్య మొసంగుట గొప్పి కొంటమి కాని బ్రహ్మనాయని యస్పృశ్యతానివారణ ప్రచారము రూపులేకుండ నాశనముఁ గావింపవలెననియు నస్పృశ్యతపై నింక నెన్నఁడు ప్రచారము గావింపరాదనియు నది సంధినిబంధనములలో ముఖ్యమైనదిగా నుండవలెననియు నామె కోరుచున్నది. అంత మగతన మున్నచో నరసింగరాజు తల నఱికినను నిష్టమే కాని పంచమాస్పృశ్యులతో సన్యాసములు మానుకొన నిచ్చగింపని యెడల సంధి యెంతమాత్రము వాంఛనీయము కాదని యుగ్గడించు నాగమ్మగారి దీక్ష యత్రమమైనను శ్లాఘాపాత్ర మనుటకు సందియము లేదు. కానిమ్ము ఈ సంధి సూత్రములనే మల్దేవప్రభుసమక్షంబున నివేదించెదఁ గాక. మతప్రచారము మాట యెట్లున్నను రాజ్య మిచ్చుచున్నారుగదా యని సంధి నిచ్చగింతురేమో చెప్పలేము. కడకుఁ గొంత కాలమైనను మతప్రచారము మాని యుండుట కొప్పుకొందురేమో చూడవలసియున్నది. ఈ యాలోచనము నాగమ్మగారికే మాత్ర మిష్టము లేకున్నను నలగామరాజుగారు సుముఖులుగాఁ గన్పడినారు. ప్రయత్నించెదను. పైన దైవమున్నాఁడు.

(నిష్క్రమి)

## దృశ్యము 22
## మల్లదేవుని సభ.

బాలచంద్రుఁడు తన్నమదాను మల్లదేవుఁడు గూర్చుండి యుందురు.

—† కోటకేతుఁడు †—

(బ్రహ్మనాయనితోఁ బ్రవేశించి) మలిదేవ ప్రభువర్యులకు నమస్కారము.

—† మల్లదేవుఁడు †—

ధరణికోటయానరాజ్యాభిషిక్తుల కభివాదనములు.

—♦ బ్రహ్మనాయఁడు ♦—

ఈ యాసనం బధిష్ఠింపుఁడు.

—§ కోటకేతుఁడు §—

చిత్తము. తమరు గూడఁ గూర్చుండుఁడు.

—† బ్రహ్మనాయఁడు †—

తమరు నేఁడు శత్రుపక్షంబున నున్నను మాతో సంప్రతించునట్టి కుతూహలము గలిగినందులకు మే మెంతయుఁ గృతజ్ఞులము.

—‡ కోటకేతుఁడు ‡—

అనుగృహీతుఁడను. (లేచి) ప్రభువులకును పెద్దలకును నమస్కరించి నా విజ్ఞాపన వాక్యంబులు శ్రద్ధతో నాలకింపవలెనని ప్రార్థించుచున్నాను. అనేక సంవత్సరములనుండియు నిర్వరయశోసూన్ముద్రితంబై దక్షిణదేశస్థ నిఖిల రాజ్యతారకానివహరాకాచంద్ర

వింబాయమానమై పరమహీపాలురపౌరుషం బెక్కి రానీక ప్రజాపరిబోధంబున మందంబ చేయుచు సర్వజనశ్లాఘాపాత్రంబైన యీ పల్నాటిరాజ్యం బంతయుఁ గీర్తిశేషులగు నలుగురాజుగారి పాలిశా పత్యంబున నెంత తల యెత్తి తిరిగినదో యట్టివాఁడ నగు నాకుఁ దెలియకపోయినను పెద్ద లందఱకును విశదమై యున్నది. అలుగుమహీనాథునికిఁ దోడు నీడయై కార్యంబునకును ఖడ్గమునకును దగినవాఁడై యద్వితీయప్రతిభామహోన్నమంబుల కలిమిచే సమర్థుండైన దొడ్డనాయని మంత్రిత్వంబు పల్నాటి రాజ్యవుటుచ్ఛస్థితికిఁ బునాది యని యంగీకరింపక తప్పదు. పున్నమనాఁటి వెనుకఁ జందమామ గొప్పఁదనమువలెను నియమముతప్ప భుజింప నిశ్చయించు వాని శరీరారోగ్యము తెలుఁగునను నా రాజమంత్రు లిద్దరును దేహము చాలింపఁగానే క్రమక్రమముగాఁ బల్నాటి ప్రభావంబు సన్నగిల్లఁ జొచ్చినట్లు వినుచుండు నాకోట్లకే కంటఁ దడి కాఱుచున్నప్పుడు ప్రత్యక్షముగాఁ జూచి బ్రహ్మనాయఁడుగా రెట్లు పరితపించుచుండిరో మనము చెప్పలేము. అలుగురాజు వెనుక ముఖ్యముగా శైవవైష్ణవమతపరస్పరనిందాపూర్వకాందోళనఫలంబుచేనైన నేమి యితరకారణంబులచేనైన నేమి ప్రజాసంఘంబులలో దశాంతి పెచ్చు పెరిగి యది యీ విశాలరాజ్యైకత్వమునకు భంగము గలిగించి “గురిజాలరాజ్యము — మాచెర్లరాజ్యము” నను రెండు చీలికలగునట్లు చేయుటకుఁ దోల్పడుటచే వీరియందు రాష్ట్రీయులకును నించుక యలక్ష్యము గలిగించినదని ప్రాజ్ఞులు గ్రహింపవలెను. పరనిందాస్తుతులకు దాసులు కాకుండ ధర్మనిరూపణమే కర్తవ్యముగాఁ గలిగిన రాయబారులఁ జూచి — కఠినంబైనను సత్యంబుద్ఘాటించునప్పుడు పెద్ద లాగ్రహింపకుందురుగాక. అన్యోన్యానురాగలతికలచేఁ బెనచివేయం బడి యైకమత్యంబుచే జీవనంబుసేయు రాజకుటుంబములోనే మతసంఘర్షణంబులు గలిగి దేశంబున నవి ప్రతిధ్వనించి రెండుమతంబులలోని యుద్రేకపూరితులగు యువజనులను భూమికృషి చేతిపనులు నను నున్నతోద్యోగంబులనుండి చాలవఱకు మరలించి యనావశ్యకాందోళనంబులో మునిఁగించి దేశసంపద కనష్టంబు గలిగించెను. దీనికిఁ గారణ మెవరైన నేమి వారు భరతమాత యెడ మిగుల నక్రమముగాఁ బ్రవర్తించి నారని స్థిరీకరించుచున్నాను. పాలితులకు ధర్మబోధనము గావింపవలసిన రాజకుటుంబము లోని యన్నదమ్ములే యుద్ధంబునకుఁ గదలి వచ్చి సంకలితమంబుగాఁ బోరు సల్పునప్పుడు రాష్ట్రీయులలో మాత్రము సౌభ్రాత్రాదిసద్గుణంబు లెక్కడ నుండి వచ్చును? అంతియ కాక యిట్టి యుద్ధంబులచే జననాశనము క్షామము ప్రజానాశనకరంబు లగు సంటుజాడ్యములు మొదలగున వెన్నియో సంభవించు నని యెఱింగియుండియు గురిజాల వారును మాచెరల వారును నిట్లు నింద్యంబులగు యుద్ధసన్నాహంబులు గావించుట బుద్ధిమంతుల కసహ్యంబుగ నున్నదని నిర్విశంకంబుగా గ్రహింపుఁడు. ఈ మూఁడు పూటల నుండియు నీ విషయంబులు వారికెదుటఁ గూడ నివేదించి నా యారాటము మీ సన్నిధిఁ దెలిపికొని యెటులైనను సంధి కుపక్రమించునట్లు ప్రోత్సహించుటకై యేతెంచితిని. ముగ్గురుమాటలు లేకుండ మాచెర్ల రాజ్యము మల్లదేవుల కిచ్చివేయుట సంభావ్యమనియు నవశ్యాచరణీయ మనియుఁ బల్కి వచ్చితిని. మీలో మీకుఁ బరస్పరవివాదంబులు గలిగి యే పాపపుణ్యంబు లెఱుఁగక నోరు లేని మోటు పశువు లనఁ దగిన యీ సైనికులఁ దెచ్చి మీ స్వప్రయోజనంబు కొఱకు — వారిని యుద్ధంబున బలి దీయుచు నిట్లు భూతహింస గావించుట మీ వంటి వారికిఁ దగునా యని సందేహించుచున్నాను.

—: కన్నమదాసు :—

ఇది యనాదిగ వచ్చుచున్న యాచారమే కాని క్రొత్తదిగాదు. కాని ధర్మబోధంబు గావించు రాయబారినే హత్యగావించిన వారి నింకే మనవలెనో తెలియకున్నది!

—: కోటకేతుఁడు :—

బాలరాజు మరణంబు గూర్చి యెత్తి పొడుచుచున్నారని యెఱుఁగుదును. ఈ సందర్భంబున దమ కంత చెప్పఁ గలవాఁడను గాను. తుట్టియు

కడవఁబడువాని ద్రవ్యటల్ కానివనుల
ప్రస్తుతోద్భోధవిషయంబె భావవీధి
మెలయుచుండుట మేలని మనవిసేతు
సర్వ మెఱిఁగిన శాంతభూషణులు మీరు.

—: కన్నమదాసు :—

శాంతభూషణులము కావున నెన్ని యుండగంబులవా రొనరించుచున్నను నోరు మూసికొని యుండవలయుఁ గాఁబోలు.

—: కోటకేతుఁడు :—

నే నట్లనలేదు. జరిగిన దేమో జరిగినది ఇఁక నైనను సంధి మేలని నా యాశయము.

రాయబారంబు వంశవృక్షంబున నున్న
పడుచు పాయంపు టలరాజు పడె నటంచుఁ
గినిసి యేతెంచి కడిమితోఁ బెనఁగి వార
లరయ నీకైన సంధి ప్రత్యుపకారంబు.

బాపుబాపు! కరాంచిం దొరయుచుం
బుగాన ననోర్వక్ష కా
ర్యాహంకార తరువ్రికాండముల నా
టాడించి యున్నారు; చా
లాహా! మీ రణసాహసంబు ప్రక
టం బయ్యెం బ్రపంచంబునన్
స్నేహం బూని సుఖింపగయ్య స్వజన
శ్రేయఃఖిలాషంబునన్.

పూర్వ మన్నదమ్ములయిన కౌరవపాండవులలో యుద్ధ మేమాత్రము శ్లాఘనీయంబుగా నున్నది! యుద్ధంబున సోదరుల నెల్లరను రూపుమాపి “నా” యను వారెవ్వరును లేక పాండవు లేపాటి సౌఖ్య మనుభవించిరో?

అలరాజెట్టిఁ బురస్కరించుకొని, కా
ర్యంబూడి యందన్నద
మ్ములఁ బోరాడి కదా — యశస్సు గొనఁగా
బుట్టెన్ మనోవాంఛ మీ
విలసద్వంశము గ్రాలకుండ విషమున్
జేయింతురే బ్రహ్మనా
యుల బుద్ధిప్రతిభల్ మఱుంగు పడెనే
దుష్కాలకర్మంబులన్.

కడఁగి యొకరికొకరు బోరాడఁ గలిగియున్న
శాత్రవుల — కాదు బంధులఁ బౌత్రపౌత్రు
లైన రాజన్యుల మథనభాజనము లే?
పాండవులపాటి సౌఖ్యమున్ బడుట లేదా?

—: మల్లదేవుఁడు :—

అసలు సంగతిఁ గూర్చి కొంచె మెత్తియం

తటితో విరమించి నారు. వారు రాజ్యమిత్తురో లేదో స్పష్టముగాఁ దెలియుట లేదు.

—◆ కన్నమదాసు ◆—

అది మన మనుగు లెందులకు? సంధిపేరిట నెప్పుడు కలిగెనో యప్పుడే రాజ్యమిచ్చు నిర్బంధంబుండు గదా. అట్లు కానిచో రక్తమాంసాదులతో యుద్ధకాళికాపూజ నిశ్శంకంబుగా నవరింప వచ్చును. మన కా భయ మవసరము లేదు.

—✱ బాలచంద్రుఁడు ✱—

రాజ్యంబు మాటయటుండ నిండు. శూర శ్రేష్ఠుం డనిపించుకొనిన యలగాజును హత్య గావించిన ఘాతుకుల నూరక విడిచి పుత్తురా! అంత ఘనత వహించి వృద్ధికాముండైన యల్లుఁడగు నలరాజు చావున కింతయు విచారము సూపని వారి నేమనవలెనో యెఱుఁగకున్నాను.

—† కోటకేతుఁడు —

పాప మట్లనవలదు. అలరాజు చావునకై రాజుగా రెంతయు జింతించుచున్నారు.

చనిన యలరాజు నల్గామజననిభునకు
"పంచప్రాణాలు" విడిచెడు బాంధవుండు
నుమ్మరంబైన చింతాబ్ధి మునిఁగె నతఁడు
కాని దుర్విధి కెదురీఁదఁ గలరె జనులు.

వీరులారా! నే నొక్కటి మనవి సేసెదను. చిత్తగింపుఁడు.

రక్తబలిప్రాప్త రాజ్యభాగము కంటె
ఘనులకుఁ దిరిసెంచె గౌరవంబు
నొందటఁ గా దనినను బోరు నిల్పిన మీకు
రాజ్యం బొసంగు భారంబు కాది

చలమూని పరసింగు తలఁ జట్టి నలిచిన
మన కింక నలరాజు మగిడి రాఁడు
కయ్యంబు వగ పెంచ్చఁ గారణంబగుఁ జూడి
నగరు సంధి మనవ్వి తగిన ప్రభువు
స్నేహహస్తంబు రాజకంఠీరవుండు
చాఁచ గలఁడు మీ శిరలస్పర్శమునకు
వారిపైఁ బ్రేమ కాకున్న వచ్చియున్న
ప్రాణికోటికిఁ బెట్టుఁడు ప్రాణభిక్ష.

మఱియును

దుర్బలుఁడు శక్తిచేత శత్రువుల నోర్వఁ
జెలిమి నొకరించి లోఁగొను బలయుతుండు
పోటు పొడుచుట పాజ్ఞుల మాట గాదు
రణము ఫలితంబు రాజ్యసంగ్రహము కాదె.

ఎన్ని కష్టంబు లనుభవించి యైనను గడకు వా రెన్ని నిరోధంబు లేర్పఱచినను సహించి యహింసాసిద్ధాంతమును బై కెత్తి ప్రజామార్గదర్శకులు గావలెనని నీతికోవిదులగు బ్రహ్మనాదుల నుద్బోధించుచున్నాను.

—✱ బ్రహ్మనాయఁడు ✱—

(లేచి) వీరులారా! గురిజాల ప్రభువులతో మాచెర్ల రాజ్యప్రదానంబుగూర్చి మాటాడి యొప్పించి మన సన్నిధికి వచ్చి యనవసరంబుగాఁ గయ్యంబు పెంచుకొనుట కూడదని పని యనియు నీ రెండు పక్షంబుల వారును నైకమత్యంబున మెలంగుట శ్రేయోదాయక మనియు నింతిగాఁ జెప్పుచున్న ధరణికోటయునరాజుగారైన కోటకేతు ప్రభువులకు వీరుల పక్షంబున హృదయపూర్వకనమస్కారంబు లొనర్చుచున్నాను. వారు గావించిన హితబోధ మవశ్యము పరిగ్రాహ్య మనుటకు సంది



పల్నాటిపౌరుషము.

యము లేదు. అశ్రుతపూర్వంబును నదృష్టపూర్వంబును నైన పతివ్రతాధురంధరత్వముగల నాగమ్మగారి చేతులలో మన మెన్ని యిబ్బందులు పడినను గడకైనను వారు స్నేహహస్తంబు సాఁచుచున్నప్పుడు పరిగ్రహింపకుండుట సాధువర్తనుల లక్షణము కాదేమో యని శంకించుచున్నాను. కోపము తాత్కాలికమై క్షణభంగురమై యుండవలెఁ గాని దీర్ఘమై యవినశ్వరమై యుండుట ధర్మవేత్తలగు వారికిఁ దగదను విషయము పెద్ద లందఱును సంగీకరించినదియే యని నేను మీకుఁ జెప్ప నక్కఱలేదు. పరిస్థితులు విషమించియో పూర్వహృదయంబు పరిణామంబు నొందియో నాయకురాలు వచ్చి — మన మెందు కొఱ కింత దూరము వచ్చి యుద్ధం బొనర్ప నిశ్చయించుకొంటిమో యా రాజ్యము మఱల మన కిచ్చి సంధి సేయఁ గోరినప్పుడు మన మింకను బిగించుట తగునా? పూర్వ మన్ని దుష్కార్యములు సేసిన నాయకురాలి నూరక పోనిచ్చుట సమంజసము గాదని మీ రూహింపవలదని ప్రార్థించుచున్నాను. అలరాజు పగఁ దీర్చుటకై యుద్ధ మొనర్చినను జయమో పరాజయమో యెవ్వఁ డెఱుఁగును? పరాజయ మగునో రాజ్యంబు గూడఁ బోవును గదా.

మాచెరలరాజ్య మిత్తుమ మరలఁ దమకుఁ
బ్రార్థన మొనర్చె నాయకురాలు నేఁడు
జయపరాజయవిభ్రమగర్జనము లేల
గతము మఱవంగ వలె సంధికార్యమునకు.

మఱియు

అయినది యేమొ యైనది యు
పోయెను మంత్రుఁడు నల్లగామ భూ
దయితుని ముద్దుటల్లుఁడు ని
తాంతయశుం డలరాజు పూనికే

తలపోసిన ప్రబంగిచుంట నల
వారికిఁ గూడ విచార మంతయ ని
శ్చయమని నమ్మి కోరుఁడు
చాఁచిన తల్లని స్నేహహస్తముల్.

పరిగ్రాభిప్రాయము మెల్లుడుఁ గలదా యని విచారించి నశముకొనుటము వీరులకు నేను విశేషముగాఁ జెప్ప నక్కఱ లేదు.

ఏ చెటులున్న లోకమున
తేనియుఁ జంకఁగఁ బోలు రాజ్య సం
పాదన మబ్బుచుండినను
బాము వగం గొని నిర్మలవ్యథా
పోదక సేవలం జదువు
చుండిన లోకము మెచ్చునే? ప్రజా
వాదభరానుసారివరి
పాలనబుద్ధులు మీ రెఱుంగరే.

నాకుఁ దోఁచిన విషయముఁ జెప్పినాను. తరువాత వీరుల యిష్టము. అధికసంఖ్యలచే నిర్ణయింపఁబడు నట్టి తీర్మానమైనను నేనును నంగీకరింతును గాని త్రోసివేయ నని చెప్పుచున్నాను.

—| మల్లదేవుఁడు |—

నాయఁడుగారు దమయభిప్రాయమును వెలిబుచ్చినారు. ఇతరులు గూడ నెవరికిఁ దోఁచినట్లు వారు వ్యక్తీకరింపవచ్చును.

—| బ్రహ్మనాయఁడు |—

ఇట్టి మహానిర్ణయము గావించునప్పుడు ప్రత్యేకవ్యక్తుల గొప్పఁదనంబులఁ బరికింపరా దని హెచ్చరించుచున్నాను. ఎవరి యంతరాత్మ ప్రకారము వారు మాటాడవచ్చును.

—◆ కన్నమదాసు ◆—

(లేచి తనలో) మన వీరులలోఁ గొందఱకును సాయము వచ్చిన వారిలోఁ బెద్దలగు వారికిని దండ్రిగా రాడిన పల్కులు మిక్కిలిగా రుచించి

నట్లు వారి ముఖవికాసములు శిరఃకంపములు రూఢి పఱచుచున్నవి. కానిమ్ము నాకుఁ దోఁచినది నే జెప్పెదను. (ప్రకా) వీరవరులారా! వాక్చతురులైన కోటకేతుప్రభువు గారి వలెనే మా తండ్రిగారగు బ్రహ్మనాయఁడు గారును సంధివిషయంబు పండొలిచి చేతఁ బెట్టినట్లు విశదీకరించియున్నారు. అనాఁడన్యాయప్రధానంబైన కోడిపోరులో నోడ కట్టుబోతు సాయంబున మమ్ముల నోడించి వనవాసంబున కంపఁగా నా బాలవృద్ధంబుగాఁ గానల పాలయిపోయి — ఒక యేడు గాదు — యేడేండ్లు భాషాతీతంబు లయిన కష్టంబులం దుడ్డుగుడుచు చున్నను దయ కొంచెమైనను లేక పాపభీతి యంతకు ముందే లేక భిల్లులం బంపి పశుహరణము మొదలగు దుష్కార్యంబు లాచరింపించి తుదకైనను మా రాజ్యము మా కీయక యేడిపించి యెత్తిపొడుపు చేసి రాయబారిగా వచ్చిన యలరాజును హత్య గావించుటకుఁ గూడఁ బాల్పడిన దుర్మార్గులింకను జీవించియుండుట యీ వీరుల మగతనంబునకుఁ గళంకముఁ దెచ్చుచున్న దని నమ్మెదను. మన సంగతి యెట్లున్నను లోకము గాఱకైనను నా దుస్స్వభావుల రూపుమాపుట న్యాయ మని యభిప్రాయపడుచున్నాను. అది కాకపోయినను నీ సంధి వలన వారు మనకుఁ బ్రత్యేకముగాఁ గావించిన మేలేమున్నది? మన మాచెర్ల రాజ్యము మన కిచ్చుచున్నారు అంతియే కద. వీరి దుశ్చేష్టల వలననే కదా మన పశువులకు రక్షకుఁడైన లంకన్నను, రాయబారి యయిన యలరాజును జంపుకొంటిమి. ఈదుండగముల కేమి ప్రాయశ్చిత్తము వారు విధింపుకొందురు? అదిగాక, యొకవేళ నెట్టి నిరోధంబులఁ గలిగించుచున్నను నహింసాసిద్ధాంతనిర్వహణము కొఱకు సంధిఁ జేసికొనవలె నని రాయబారి యగు కోటకేతుప్రభువు గారు బోధించుచున్నారు. సంధిసూత్రములలో మతప్రచార నిరోధకములగు సూత్రము లెవ్వియైనను నున్నవేమో యింకను బయలుపడలేదు. ఎన్ని తీపిమాటలు పలికినను వారికిఁ దగిన ప్రాయశ్చిత్తము కానిదే సంధి వాంఛనీయము కాదని నా నిశ్చయాభిప్రాయము.

—* బాలచంద్రుఁడు *—

(లేచి) మహాశయులారా! పిన్నవాఁడనని త్రోసిపుచ్చక నా మనవిని గొంతవడి వినవలెనని సభాసదుల సందఱఁ గేల్మోడ్పులతోఁ బ్రార్థించుచున్నాను. మంచిచెడ్డల నారయునెడఁ జిన్నపెద్దలను విషయం బవిచార్యంబు. మీలోఁ గొందఱు మనః కేదారక్షేత్రంబు నందలి ద్వేషాభిప్రాయంబు లను మొక్కలను నాయీ చెప్పుమాట తెవులుగాఁ బరిణమింపవచ్చును. అక్కారణంబున నన్ను దూషింపం జనదు. ఈ సందర్భమున నా యభిప్రాయంబులు నేను విశదీకరించుట తప్పుగాదు. ధార్తరాష్ట్రసభామధ్యంబున దుర్యోధనాదులకు ధర్మోపదేశం బొనర్చు వికర్ణుని వలెను దండ్రి యెదుట హరిగుణకీర్తనంబు గావించుచు నీతి గఱపు ప్రహ్లాదుని వలెను నేను మీ యందఱి సమక్షంబున నిల్వఁబడి మిక్కిలి సాహసముతో మీ రీ రాయబారి మధురవచనంబు లాకర్ణింప వలదని ప్రబోధించుచున్నాను. నేఁటి యుదయము నఱకు జాజ్జ్వల్యమానంబై యుండిన మీ యుత్సాహాగ్నికిఁ గోటకేతుప్రభువుల రాయబారంపుఁ బలుకు లార్ద్రకాష్ఠంబు లయినవి కాని నిజమాలోచించిన యెడ నాబోంట్ల కందఱకు నవి యెం





తిన చిడుగులై దాని నుద్దీపనఁ జేయుచున్నవి. వీరపుంగవులారా! నా మాటలు మీకుఁ బరిహాసాస్పదము లగునేమో కాని మిమ్ములఁ జూచిన నాకు [illegible] తలఁచుచున్నవి. నిశ్చయముగా [illegible] మాటయే నాయకురాలు సంధికి [illegible] దనుకొనుచున్నారా?

అండిన [illegible]
[illegible]
[illegible]
[illegible] పంగిన [illegible]
[illegible]
[illegible]
[illegible]
పట్టి విరోధుల మైత్రిఁ గోరదగా.

[illegible] గల్గఁగ న
[illegible] గోరకం
[illegible] బరస్పర [illegible]
[illegible]
[illegible] గండ
[illegible]
[illegible]
[illegible]

[illegible]
[illegible]
[illegible]
సంధించు [illegible]
[illegible]
[illegible]
[illegible] ప్రొద్దు [illegible]
[illegible]

యాహా! నా చిత్తమా [illegible] నను
[illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible] సంధి సూత్రంబులగా.

— కోటకేతుఁడు —

మీ రాజ్యము మీ కిచ్చుచున్నను నెట్టి విషమనియమములఁ గోరుట పాడిగాదు.

— బాలచంద్రుఁడు —

రాజ్య మిచ్చుచున్నాము. రాజ్య మిచ్చుచున్నా "మనుచున్నారు; రాజ్య మెవరిక యిచ్చుచున్నారో?

రణము [illegible]
రంతియే కద — [illegible]
[illegible]
[illegible] ప్రాయశ్చిత్త [illegible]

—* బ్రహ్మనాయఁడు *—

అందుకొఱకా యుద్ధంబు సాగించి యీ సేనాసమూహంబును హతము గావించుట! ప్రాజ్ఞులొప్పుదురా? మన వీరులలోఁ గూడఁ జాల మంది యీ మాట లొప్పుకొందు రని నే నను కొనను.

(తెరలో) నోరు నిశ్చయము.

— బాలచంద్రుఁడు —

అవును. పెద్దలిట్లు ప్రోత్సహించుచుండ వా రేల యొప్పుకొందురు? మన యలరాజును

బోరిగొనినా రణకౌశలంబది మాత్రమెక్కాదు నేను వారి విధ్వంసనంబు గోరుట. ఇట్టి దుర్మార్గులు యథేచ్ఛంబుగా బ్రతుకుట లోకమ్మున కని ర్వచనీయకష్టంబులం గూర్చుటకే యని యెఱుంగుడు. అట్టివారి దుండగంబుల నిట్టి మహా యుద్ధంబులు గాని యాపవు. లోకకంటకులైన దుర్మార్గుల జీవితము భూదేవికి సంతాపకరము. కంస, శిశుపాల, నరకాసురాదులను శ్రీకృష్ణభగవానుండు తెలివితక్కువ చేతనే నాశన మొనర్చెనా?

(సభలో నొకరు —) వినుండు వినుండు

(మఱికొందఱు) కుఱ్ఱవాండ్ర మాట విని మోసపోకుండు బ్రహ్మనాయుడు గారి మాట వినుడు.

(మఱికొందఱు గోలగా) చిన్నపెద్ద లను తారతమ్య మక్కఱ లేదు. పల్నాటి పౌరుషము నకు భంగము గలిగింపకుడు.

(సభలో) వినుండు. వినుండు.

వలదు. వలదు.

(అని తెరలో పెద్ద గోల చేయుదురు)

—† బాలచంద్రుడు †—

(కోపవికారములతో)

ఇదమిద్దతవశాపదుల! ఎటులం
డ్రింపుచున్ గనుం జెల్ల రో
మ్మదలన్ సంధి కొప్పుగ తోడ్ మూడునన్
భూమండలం జెల్ల వ...
వ్వారె? మీ పౌరుష మేడ నుండెం గలిగెన్
వచ్చేరే! కార్యంబుకీ
కదన ఝోటిక శౌర్యాత్ముపటుక
దగ్గజాలిక బడా

తిదళంబుం గొనివచ్చు బెండ్లుల కోక్కుల
ద్దిన్ జాడ్య మూర్ఖన్నమై
కద యా సంధికి లోంగుచుంటి రట వీ
కాంతా దులన్ మీరు పో
యి దలిర్పన్ వసియింప సిగ్గులకు నీ
వృద్ధ్యుడనిం గొంచు న
మ్మద మొచ్చం బడివచ్చినారు? నలగా
మాత్రాత వచ్చింపు దు
ర్వరోగంబున నాడుదాని దగు దు
ర్గంధాంగముం బ్రాని ము
న్నదిరా! చంపిన రాయబారిని విషా
హారంబుచేఁ జంపఁగాఁ
గద మీ రందఱు వచ్చినా రిటకు;

—† బ్రహ్మనాయుడు †—

ముఖ్యముగా రాజ్యము సంపాదించుట కొఱకే యుద్ధమునకు వచ్చినాము.

—§ బాలచంద్రుడు §—

భూఖండం బోసంగంగ వీ
ర్యాదయాంతకనేవ రణాసకరూ లో
ద్రిక్తవవద్యోగ్రగరా
జదమర్షాగ్ని శిఖాకలాపము లిఁకం
జల్లాఱునే? యల్పస
మృదులారా! మొదలింటినుండియు విజృం
భదద్వైరాయుంట కా
క దురన్యాయము కోడిపోరితములోఁ
గాన్పించి ఘోరాటవీ
పదముం గూర్చిన టక్కులాఁడిఁ బగగం
టన్ బాలచందాలల్లా
ము దురద్యోగిని నాగమఁ గడిసి యా
ప్తశక్తిం జెల్లవా
యా దయా కుస్యా లోగుకో వరగబా
వ్యాఘ్రాకిపొంగరిల
విదళింపన్ వలెఁ గాని శ్రీ యగుట లో
క్యైక్యంబు మాటించి చం





ద్రదమన్నన్ మనకో కొఱంత; రెుటులేఁ
గోరన్ సమీపించి తా
నెదురం గాయము ద్రుంచునేని విడుతున్
హేలన్ వినుం డామకు
ట్యదయం బూన్చు చు రాయబారికి విసం
బుం బెట్టు నా కుటిల కా
ష్పదమై యుంచిన నర్సరాజును — బరి
స్రంసన్మదోద్రేక కా
ర్యదురంతస్థిర ధైర్యశౌర్యబలులా
రా! దుష్ప్రలాపంబు గా
దిది నల్గాముని గుండెగాలమయి నే
నెక్కే నృసింహాధిపున్
ముదహాస్తిన్ హరి రీతిఁ బైఁగవిసి కుం
భద్వయ శ్లాఘ సీచేఁ
గదనక్షోణిజనంబు తల్లడపడన్
ఖండింతు శీర్షంబు నా
దిదియే నుండి ప్రతిజ్ఞ; చెప్పెదను నే
నీనాఁడుఁ బాలింతు వ
య్యది బ్రహ్మాగులు వచ్చి యడ్డయిన మా
ద్వ్యక్షద్వివిక్షేపమా
త్రదళచ్ఛాత్రవధైర్యకంచుకుఁడనై
దర్పించి పోరాడ నే
ర్చెద; వెన్కాడుట లేదు; నే నొకఁడనే
చెండాడఁగా నేర్తు నాఁ
డిది భంగిన్ శిబిరంబులం దోఁచిగి పో
టుం జూప కిట్లుండుటా?
మది కారాటము లేదె? యిం దసువులన్
వ్రగ్గించి దోర్దర్ప సం
పదఁ జూపించి జవాలి మెప్పుఁ గొనరే!
పల్నాటి వీర్యంబు చం
ప్రదురే? పౌరుషహీనులార! యిటు మి
మ్మం బాసి నే నొంటినై
వ దురంబందుఁ బ్రతిజ్ఞఁ దీర్చికొన బ్రా
ణంబైన నర్పించెదన్.

(కూర్చుండును)

(తెరలోఁ జాలమంది చప్పటులు నలుతురు.)

—* బాలచంద్రుడు *—

మొదటఁ దమ యుపన్యాసములో నట్టి నిరోధముల కైనను సహించి యీ సంధి కొప్పుకొనుఁ డని రాయబారిగారు హెచ్చరించినారు. అవి మతిప్రచారనిరోధము లేమో? అవిగూడ సంధిసూత్రములలోనివే?

—‡ కోటకేతుడు ‡—

సంధి యెంతమాత్ర మిష్టము లేని వారి కా సూత్రముల మాట యెందుకు లెండు.

—† బ్రహ్మనాయుడు †—

అవును. నేను గూడ మఱచినాను. మాచెర్ల రాజ్యము మా కిచ్చిన ట్లొప్పుకొనుచు నిం కేవయిన వారు చెప్పిరేమో తెలిసికొనవలెనని యున్నది.

—♦ కోటకేతుడు ♦—

మీరు మాచెర్లరాజ్యము తీసికొనుట యును, నందుకు బదులుగా నాల్గు సంవత్సరములు మీరు పంచమాస్పృశ్యతానిరోధక ప్రచారమును మానుకొనున ట్లొడంబడుటయు సంధిసూత్రము లలో ముఖ్యమైనవిగా నుండవలె నని నాగమ్మ గారి యూహగా నున్నది. ఆమెను గూడఁ గొంత వఱకుఁ గ్రిందికి దింపవచ్చును. నా కా ధైర్యము గలదు. రెండు పక్షంబులవారును దమ పట్టుదలలు సడలువిడచిన గాని సంధి పొసఁగదు గదా. అయి నను నా విషయ మేల — రాజ్య మిచ్చినను సంధి యక్కఱలే దనుచున్నారు గదా.

—♦ బ్రహ్మనాయుడు ♦—

ఏమీ! మాలమాదిగల యభివృద్ధికై చేయు ప్రచారమును మేము మానుకొనవలెనుగా! ఎంతమాట! ఈ మాచెర్లరాజ్యము మాకిచ్చినను

సరియే. లేకున్నను సరియే. చిరకాలము ప్రజాహితజీవనంబునం దుండి నిమ్నజాత్యుద్ధరణపవిత్రాశయముచే లోకోద్ధరణంబును దానిచే నాత్మోద్ధరణంబును గావించుచున్న మా పవిత్రకార్యంబుల కడ్డుతగులుగునట్టి సంధికి మేము బద్ధులము కామని వారు స్పష్టముగా ముందే యెఱింగియుండుట మేలు. రాజ్యానుభవమునం దైనను గొంత లోటు గల్గిన నొప్పికొందుము గాని మాలమాదిగల నుద్ధరించు ప్రయత్నంబులందు మాత్ర మెవ్వ రడ్డుపడినను నోర్వఁజాలము.

—‡ మల్లదేవుఁడు ‡—

నాయుఁడు గారితో నేను బూర్ణముగ నేకీభవించుచున్నాను.

—* గోటకేతుఁడు *—

రాయబారంబున కేమని ప్రత్యుత్తర మిచ్చెదరు?

—‡ మల్లదేవుఁడు ‡—

నిమ్నజాత్యుద్ధరణప్రచారము నొక దినమైనను నాపక యవిరామము యథాపూర్వము దాని నుందే. నిమగ్నులము కాఁదలఁచితి మని చెప్పవచ్చును. వారి కంగీకారమైన మాచెర్లరాజ్య మిచ్చినచో మిగిలిన వీరుల నొప్పించుటకుఁ బ్రయత్నముఁ జేయుదుము. లేకున్న మొదల యుద్ధమే రాజ్యవిషయంబును బరిష్కరింపఁగలదు.

—‡ గోటకేతుఁడు ‡—

(లేచి) సంధి మీ రంగీకరింపకుండుటచే నీ కారంపూడి యుద్ధ మెందఱ వీరోత్తముల బలి దీయునో తెలియదు. అన్నిటికిని భగవంతుఁ డున్నాఁడు. పోయి వచ్చెదను. నమస్కారము.

(బ్రహ్మనాయనితోఁ గోటకేతుఁడు నిష్క్రి)
తెరపడును.)

దృశ్యము. 23
రామశాస్త్రి ప్రవేశము.

—† రామశాస్త్రి ‡—

బ్రాహ్మణజన్మ మెత్తి పురోహితకర్మలందుఁ గాలముఁ గడపు నేను బ్రహ్మనాయుఁడు గారి మాట నిరాకరింపలేక పంచాంగముఁ జెప్పుటకు గారంపూడి వచ్చినందులకు మనస్సు సహజబ్రాహ్మణశాంతగుణంబుల నీసడించి యుద్ధభూమిం దుముకు నంత యుద్వేగంబున నవశం బగుచున్నది. ఆహా! ఏమి యుద్ధము! ఈ కారంపూడి యుద్ధము నందుఁ బల్నాటి వీరులు ప్రదర్శించుచున్న యపారపౌరుషప్రతాపప్రదర్శన విజృంభణంబుల వృత్తాంతంబు లాకల్పాంతస్థాయులై కాలాంతరములచే మోమువడుచుండఁగల మా తెనుగుబిడ్డల మగతనంబుల నప్పటప్పటికి మఱల మఱలఁ జివురు వెట్టించుచుండును గాక. మతవిషయంబున రెండు పక్షంబుల వారును నడలువిడువకుంటచేఁ గోటకేతుని రాయబారంబు విఫలంబై యుద్ధము రెండు దినంబులు సాగి తృతీయదినంబు గడచుచున్నది. మన పక్షంబు నందలి వీరులలో నొక్కండగు గోవిందుల బాపినీఁడు ధరణికోటాధీశ్వరుండయిన భీమదేవునితోఁ బోరి యాతని మూర్ఛాక్రాంతుం జేసి యనంతరము గోటకేతువు హస్తలాఘవంబున కాఁగలేక లోకబాంధవునితోఁ బాటస్తమించుటయు, నా పైపు మాదిగుల వీరారెడ్డి మన పినమల్లదేవుని నిహతుం జేయుటయుఁ జూడఁ గొంచెము హృదయంబునకుఁ బరితాపంబు గలిగినది కాని బ్రహ్మనాయని యొక్కయు బాలచంద్రుని యొక్కయు నకుటిలవీర్యవిహారంబును నేత్రోత్సవంబుగాఁ జూడఁగనినప్పుడు తన్మయత్వంబున





మునిఁగిపోయితిని. బ్రహ్మనాయఁడు రథస్థుండై కోదండంబు చేత ధరించి సపత్నవాహినీకదంబంబుల దృష్టివిక్షేపమాత్రభయకంపితులంజేయుచుఁ బ్రత్యాలీఢపాదుండై విరోధుల మానసంబులఁ జిక్కువఱచు పంచబాణుని తెఱంగున బాణం బరినేసి ప్రత్యుపభావోపభావంబులు పోలె వెలువడుచుండు భల్లంబులఁ గుప్పవగూరగాఁ బఱపుచు హాహానినాదంబులు నలువు రిపుల మొత్తల నాలకించుచు హృదయకూలంకషంబైన కరుణారసంపు వెల్లువను దాత్కాలికముగాఁ దెచ్చిపెట్టికొనిన కాఠిన్యంబున నణఁగఁజేయుచు శిరంబులఁ ద్రెవ్వనేయుచు శిరోజంబుల నుప్పరంబున కెగయఁ గొట్టుచు జిహ్వాగ్రంబుల నుండి యసృగ్ధారాసంపాతంబులొలికించుచు హస్తపాదంబులలో నొక్కటొక్కటి ఖండించి వికృతాకారంబు సేకూర్చుచుఁ గళేబరంబుల నొక్కమ్మడిఁ గూల్చుచు నానావిధభీషణసమరక్రీడాలోలుండై పగవారి మూకలఁ గృశీభూతంబులు గావించుచుఁ జెచ్చెరఁ జెలఁగి యుండుట చూడని వాని జన్మ మేల! మఱియుఁ దండ్రికి దీటగుచు విరోధిప్రతిఘటనంబు లనెడి తాళచ్ఛదకుటీరంబులఁ బరశురామప్రీతి సేసిన బాలచంద్రుని శౌర్యాగ్ని వర్ణింప నెవరు సాహసింపఁగలరు? పినమల్లదేవుని జంపిన సంతసంబున బోవుచున్న మాదిగుల వీరారెడ్డిని బిలిచి బాలుఁడు తలపడి వానిని వధం బొనరించిన విధంబు జ్ఞప్తికి వచ్చినా హృదయము భయభ్రాంతం బగుచున్నది. అంతియ కాక మన సైన్య వీరులగు కన్నమనాయఁడు, ముత్సాని పిచ్చిరెడ్డి, నర్మాల కోటిలింగము, పైడిచుక్కల ముత్యాలు మున్నగు వారందఱు నాయా ప్రదేశంబులఁ గోలంకి పీరాస్వామి, పాలపర్తి రామానాయుఁడు, పోదిలెపావన్న, కారంపూడి కనకరాజు, కలవగుంట కాశీపతి మొదలగు వీరులతోఁ బోరిన క్రమంబు గూడ నాశ్చర్యాపాదకమై యున్నది. అహా! యుద్ధమెంత భీభత్సావహము! (కొంచెముండి) సరే, నే నింక నాయుఁడుగారి యాజ్ఞ చొప్పున, నలరాజు తండ్రియును బుత్రశోకంబున గృశించి మంచ మెక్కినను యుద్ధవార్తల నప్పటి కప్పుడు విను నారాటమున వచ్చియున్న కొమ్మరాజు గారి కడకుం బోయి యా యుద్ధవిషయంబులు నివేదించి పోయెదను. నేఁటి తోడనే యుద్ధము ముగియవచ్చు నని పెద్దలనుకొనుచున్నారు. ఇఁక గొంచెము సేపటికి బాలచంద్రుండు నాయకురాలిపైకిని బ్రతిజ్ఞానిర్వహణము కొఱకు నరసింగరాజు పైకిని బోవునని యనుచున్నారు. నా పని నెఱవేర్చుకొని త్వరగా యుద్ధభూమికిం బోయెదఁగాక.

(నిష్క్రి)

దృశ్యము 24
కారంపూడి యుద్ధభూమి.
బ్రహ్మనాయఁడు ప్రవేశము.

—† బ్రహ్మనాయఁడు †—

గురిజాలనుండి మాచెర్ల రాజ్యమును విభజింపఁ జేసికొని వెడలుటకుము న్దెన్నఁడో కాని యీ మధ్యకాలంబున నెన్నఁడును యుద్ధస్పర్శంబంటని కారణంబున బ్రభవించిన యీ రణకండూతి నలగామసైన్యసంఘర్షణంబున నీ నాలుగు దినంబుల నుండియుఁ గొంతవఱకుఁ దీఱినదని చెప్పవచ్చును. ద్వారసముద్రమునుండి వచ్చిన యాశ్వికుల సంఖ్య మితిమీఱియుండుటచే నది

దాదాపు విన్నటిదినం బంతయు నుచ్ఛ్వాసనిశ్శ్వాసములకును దీటీక లేకుండఁ జేసి తమ యసాధారణంబైన బాకులపోటులచే నా మగంటిమి నెంతయుఁ బరీక్షించిన దని చెప్పవచ్చును. తొలుదొల్త వారి పోరాటవుఁదీవ్రతను మించిన సంఖ్యాబాహుళ్యమును జూచి యించుక వెఱఁగందితిని గాని మాచెర్ల చెన్నకేశవుని యనుగ్రహంబున ధైర్యంబినుమడింప సాహంకారంబుగా లేఁగి బాణకౌశలంబున వారి నెల్లరఁ గసిమసంగితిని గదా. తక్కుంగలవారిని నీ నాయన కన్నమదాసునకును బాలచంద్రునికిని నొప్పగించివచ్చితిని గాని బాలుని దృష్టి నాయకురాలిపైకి నరసింగరాజుపైకిం బోవుచున్నది. నరసింగరాజుఁ జూచిన జాలి వొడముచున్నది.

బాలచంద్రుండు ప్రతిన దప్పని మగండు
పసితనంబున బెంచిన వాఁడ నగుట
నకట! నరసింగు కర్మ మెట్లగునో యంచుఁ
బరిపరివిధంబుల మనస్సు పరిగపించు.

ప్రతిజ్ఞాపరిపాలనాపేక్షతో సమరంబున దుమికిన వీరుని చర్యలఁ గూర్చి నిర్బంధించుట తగదు. యుద్ధంబున నే వీరుం డెట్లు పరాక్రమింపఁ దలఁచునో యట్లు పోనీయవలసినదియే కాని యడ్డపడుట పాడిగాదు. కానిమ్ము దైవమే కలఁడు.

(తెరలో)

ఘనబాహాలోరుబలస్ఫులింగములు జా
గ్రజ్జృంభణవేగంబునన్
దనుకన్ నాయకురాలు గొల్లమగిని వా
ధల్వెట్టుచున్నన్ భయం

బున బర్వెత్తఁగ వచ్చునే! యబలతోఁ
బోరాడఁగా లేరె? మా
ర్కొని చూపింపుఁడు సేనలార! సమర
ప్రోచ్చండధైర్యంబులన్.

(విని) ఓహో! సేనాని యెవ్వరో దళంబులకు ధైర్యంబు పురిగొల్పుచున్నాఁడు. నాయకురాలావంక నుండి వచ్చి యీ మును ముం జెండాడఁ బ్రారంభించుచున్నట్లున్నది. ఎదురు వ్యోగౌదఁ గాక.

(నిష్క్ర.)

దృశ్యము 15
నాయకురాలు ప్రవేశము.
ఒక వైపు నుండి బ్రహ్మనాయఁడు ప్రవేశించును.

—† బ్రహ్మనాయఁడు †—

విష్ణుభక్తులు తిరుమంత్రవేత్త లీరు
ధైర్యవంతులు గద మాలదాసులార!
అఁడుదానికి వెఱవ సిగ్గనలేద
రండు చూతము నాయకురాలి బిగువు.

-§ నాయకురాలు §-

(విని) అహుగో! మగవాఁడు బ్రహ్మనాయఁడితఁడే పంచముల వెనుక వేసికొని వచ్చుచున్నాఁడు. కోడిపందెము నాఁడు దప్ప నీలోపుగ నేనెన్నఁడీతని మొగంబును దగ్గఱగాఁ జూడలేదు. నేఁడు మంచి యవకాశము దొరకినది. ఈయనను నీయన వీరవైష్ణవమును బరుగులెత్తించెదఁ గాక. (ప్రకా — నాయునితో) రండు. నాయుఁడు గారిని సమీపించి చాలకాలమైనది.





—♦ బ్రహ్మనాయఁడు ♦—

అవును. చాలకాలమైనది. విపరీతపరిస్థితులతో సమీపించుటకు వీలుచాలవరయే కారణము.

—♦ నాయకురాలు ♦—

నా దేమున్నది? అంతయు స్వయంకృతాపరాధమే.

—† బ్రహ్మనాయఁడు †—

నిజమే. ఏడుసంవత్సరంబులు గడువు దాఁటఁగానే రాజ్యమాక్రమించుకొనక పోవుట స్వయంకృతాపరాధ మేమో?

-† నాయకురాలు †-

మీ రంత పోగరుబోతుదనమున రాజ్యంబున ప్రవేశించుట చూచి యూరకొనుటకు మేమేమి గాజుల్దొడిగించుకొని యుండలేదు గదా.

—✻ బ్రహ్మనాయఁడు ✻—

నిశ్చయమే. మీకు గాజులు లేవు.

పసితనమునందె తల్లిదాఁతఁ బద్మ భవుఁడు
చేతిగాజులఁ దొలగించఁజేయ మీరు
తొడిగితిరి పలగాము చేతులకు వాని
నాతనికి వచ్చె నెత్తికిఁ జేటు లిపుడు

-§ నాయకురాలు §-

నేనందుండి సర్వాధికారంబను నంకుశంబు వహించి యుండుట చేతనే పల్నాటి రాజ్యం బను మదపుటేనుఁగు వశీకృతమై యింతటి ప్రఖ్యాతికిఁ గారణంబై పరరాజుల కాదర్శప్రాయమై యున్నదని గ్రహింపుఁడు. భగవంతుఁ డానాఁడు నావంటి దాని నొకతెను గద్దె నెక్కించి మతప్రతిష్ఠఁ గాపాడెఁ గాని లేని యెడల మున్ను మీ పరిపాలనము క్రింద నున్న మాచెర్ల రాజ్యము వలె మా గురిజాల రాజ్యము గూడ "సర్వము జగన్నాథ" మై బ్రాహ్మణు లనియు మాల లనియు భేదములు లేక చెడిపోయెడిదే

-§ బ్రహ్మనాయఁడు §-

నా చేతులలోనే గురిజాలరాజ్య మున్నయెడల నట్టికొలఁది గొప్పభేదముల నంతరింపఁ జేసెడి వాఁడనే.

మానవు లందఱున్ సరిస
మానులు పుట్టుక చేతఁ; గొందఱన్
మానితరీతిఁ గొందఱను
మాలుగఁ జూచుట పాడిగాదు; లో
కానుభవంబు పంచముల
యందున దూష్యము; మాలమాదిగల్
దీనులు, వారి యుద్ధరణ
దీక్షయె కావలె రాచవారికిన్

పతితు లగు వారి నుద్ధరింపంగ వలయుఁ
గొలఁది గొప్పల భేదంబు గూడ దిపుడు
అర్థమునగాని తారతమ్యములు లేవు
వారి సేవించు సేవ యీశ్వరుని సేవ

మాలమాదిగలు గూడ మానవులని యెంచి వారి యార్థికదౌర్బల్యముఁ దొలఁగింపఁ దీనెంత కూడు వచ్చు నుపాయంబులు సేకూర్చి చదువు సంధ్యల కవకాశములు గల్గించిన యెడల వారు బ్రాహ్మణులకుఁ గూడఁ జూడామణులై ప్రకాశింతు రని నమ్ముఁడు.

-† నాయకురాలు †-

ఇట్టి యసత్కార్యములకుఁ బూనియుండుట చేతనే యనావశ్యకంబుగాఁ బాలవంటి మీ రేచర్లవంశంబునకుఁ గళంకంబు గల్గించుకొనుటయే కాక మీ వైష్ణవమతంబులో నున్న వారికే

బ్రాహ్మణులగు వారికిఁ గొందఱకు మీరు సరిపడ కున్నారు.

—◆ బ్రహ్మనాయఁడు ◆—

అత్యున్న లోకంబులయం దెవ్వరు మెప్పింపఁ గలరు. సత్త్వగుణసంపన్నులయిన మహాత్ములకే విరోధులుండుట తటస్థించుచున్నది. ఇఁక నా వంటి వారికా? అయినను వైష్ణవులలోనే కొందఱు మమ్ములను మాపరిపాలనమును నిందించు వా రుండి రంటిరి కాని పరమతసహనంబున్న మాచెర్ల రాజ్యంబులోని యీ శైవులే కొందఱు మీ గురిజాల పరిపాలనం బీసడించుచుఁ బంచమాస్పృశ్యతా ప్రచారవిషయంబున దప్ప మిగిలిన సర్వనియమము లందును సర్వపరిపాలన పద్ధతులందును పెదమల్లదేవ రాజచంద్రుని వేనోళ్లఁ బొగడి యున్నారు. దాని కే మనెదరు?

-† నాయకురాలు †-

(నవ్వుచు) ఆ నియమములు నా పద్ధతు లేవియో యొక్కింత దెలుపుఁడు. నే గూడ విని యెదను.

—† బ్రహ్మనాయఁడు †—

మీరు మాత్ర మీ విషయము విని యుండరా?

మాలిమాలజనంబుఁ బోలి యుండుమె కాని
రాజభోగంబు దూరంబు మాకుఁ
బ్రజకు వాక్స్వాతంత్ర్యవర మిచ్చితిమి కాని
వ్యాంధకంబు మా రైతు లేదు
మమ్ము విమర్శించు మనుజు మన్నింతుము
కారాగృహంబున కంపలేదు
మద్యపానాసక్తి మాన్పింతుము కాని
కల్లు ద్రాగించి మంకంబు గొనము
దృఢశరీరుల భిక్ష పెట్టింప నీము
యాచన యొనర్ప వారలు శిక్షార్హులగుదురు
బదులుపృవృత్తిని మొదలంటఁ గోసివేసి
నమ్ము మీకు మాకుఁ బొందిక యేదు.

-† నాయకురాలు !

నాయఁడుగారూ! వింటిమి. వింటిమి. మీ ప్రేలితో మీరే కన్ను బొడుచుకొనుచున్నారే! తిండికి లేక తపించు కుటుంబమున్ను రక్షించుకొనుట కొడాడఁ దిరిగి భిక్షమెత్తుకొను భిక్షగాండ్రను గూడ శిక్షించినామని చెప్పుకొనుచున్నారు. ఆహా! ఏమి మీ పరిపాలనప్రతిభావిశేషము! నాకడఁ జెప్పితిరి చాలుఁ గాని మఱొక్క యెడ వాకొన కుఁడు. గేలి సేతురు.

—✱ బ్రహ్మనాయఁడు ✱—

పడుచుదనమున నుండి దారిద్ర్యవంతులయ్యు నది యొక వృత్తిగా నెంచుకొని బిచ్చ మెత్తువారు దండుగులుగారని కించిద్జ్ఞులైన ననఁగలరా? అట్టి వారికి బిచ్చంబు పెట్టుట మహాపాతకం బని యుదారబుద్ధి గల గృహస్థులు గ్రహింపవలయును. బలశరీరులకు ముష్టి పెట్టుట వారికి సోమరితనంబు నేర్పి సంఘముపై ననవసరమైన బరువు వేయుట తప్ప వేఱుగాదు. మిక్కిలిగా బలహీనులయిన కుంటి గ్రుడ్డి మొదలగు వారికిఁ బ్రభుత్వమే యుచితముగా భోజనము పెట్టి భగవద్ధ్యానాది సద్గుణంబు లలవడఁ జేయవలెను

-◆ నాయకురాలు ◆-

మీ పద్ధతు లేవి చూచినను లోకమున కపహాస్యములుగాఁ గన్పట్టుటయే కాక నింద్యంబులని కూడ హెచ్చరించుచున్నాను. ఇట్టి బుద్ధి వికాసము గల దుష్పరిపాలకులు పుట్టి ధర్మదేవతను గుమార్గంబులం ద్రిప్పి వంచించి జీవించుచుండఁగాఁ జూచుట మా వంటి ధర్మోద్ధారకుల కవమానకరంబుగా నున్నది. మీ జాతకములు మంచివి కావు. పుట చేతనే యీ కారంపూడి యుద్ధము గలిగినది.



ఈ మహాసంగ్రామంబున మీ నాశనము మీ లోకోపద్రవకరపరిపాలననాశనము పరిసమాప్తి గావించి జయభేరి మ్రోగించెదఁ గాక. మన ప్రసంగము లింతటితోఁ జాలును. రమ్ము. యుద్ధంబు నేయుదము.

(తెరలో)

ఒక పూటైనను శేతిలోఁ బడక యుం
డో చేరి మా పంతము
శైవులఁ గొప్ప వైష్ణవులఁ శివమతా
వేశంబుతో నీ యజ్ఞం
దకటాహం బదరంగ వ్రత్తు నని మా
టల్ గోట లెక్కించు నా
యకురా లెక్కడనుండెఁ జెప్పఁడు పుటం
బార్తుల్ నిమేషంబునన్.

-§ నాయకురాలు §-

పుల్లైవి స్తరాకు వలె నా గుంటఁడు బాలచంద్రుం డెంత మిడిసిపడుచున్నాఁడు. (బాలు నుద్దేశించి) ఓరీ! బాలుఁడా! నీ పిల్లదనపు దుడుకుదనము లింకఁ జాలింపుము. ఇదిగో ముందుగా మీ యయ్యకు బుద్ధిఁ జెప్పి యనంతరము నీ పయికి నురవడించెదను. (నాయునితో) ఏమి యాలోచించుచున్నావు! కొడుకు సాయంబు గూడఁ దీసికొని కాని నాతో యుద్ధ మొనర్పలేవా యేమి?

-§ బ్రహ్మనాయఁడు §-

ప్రసంగించుట మాత్రమే కాక స్త్రీలపై గవిసి యుద్ధంబు గూడ సేయు నంతటి దౌర్భాగ్యమునకు నన్ను బాల్పను మాదురా!

శుద్ధశౌరుషఘోరసాఁతలను విడిచి
ఆఁడుదానిని బోరాడు వాఁడు గాఁడు
చండశాసనవిరుదభాస్వంతుఁ డయిన
మగలకు మగండు పెలమ బ్రహ్మనరేంద్రుఁ.

(స్వస్తి నభినయించి) ఛీ! ఆత్మస్తుతి కొగ్గితినే (ఆలోచించి) ఆ-స్తు-తి, అపగిపూర్ణులతోఁ నవలిట్టిపే. (ప్రకా) నాగమ్మగారూ! ఇన్ని దినంబుల నుండియు మా యెడలఁ గావింపబడిన దౌష్ట్యంబులచే మీతో నొకచేయిఁ జూడ వలె నని వచ్చియున్నను—యెంత మార్చుకొన్నను స్పష్టంబుగ నున్న యీ యబలారూపము సూచి మఱల మనస్సు వెనుకకు దుగుసైచినది. నే నాయువాండ్రతోఁ బోరఁ దలంపను. మిమ్ము యుద్ధంబున మార్కొన నా పుత్రుండు బాలుండు చాలును. అదుగో! అతఁడు గూడ నిటే వచ్చుచున్నాఁడు. మీ రిద్దఱుఁ దలపడుఁడు. పోయి వచ్చెదను.

(నిష్క్ర)

—◆ నాయకురాలు ◆—

ఆహా! పైకి 'నబల' యని దూఱాడుచున్నను నా విస్ఫుటపౌరుషవిభవంబు గ్రహించుటచేఁ దూలిపోవుచున్న నాయఁడు గారి మగటిమి ప్రశంసార్హము. పొమ్ము. తండ్రిగౌరవ మింత చక్కఁగా నున్నది. ఇఁకఁ గుమారుని ప్రతాపముఁ జూడవలెఁ గాఁబోలు.

—* బాలచంద్రుడు *—

(పూర్వపద్యము .... "ఒకవ్రాసైన..." యనుచుంగల జదువుచ్చుం బరీక్షించును) (వినుట నభిన యించి) ఏ [illegible] రదనాటం బొమ్మనుచున్నారా?

(సమీపించును)

—§ నాయకురాలు §—

బాలుం డేవో లేత సారకాయలు దెగ నఱకు చున్నాండే.

—‡ బాలచంద్రుడు ‡—

నాగమ్మా!

లేత సారకాయ కోంతలో, లేకయున్న
బలకుచిక్కని బిరుసు మెక్కలపుజగిరియు
కాయండనకా నీ పాలింటి కాయండనకా
పట్టిచూపెద రాయమ్మ పుట్టుకుంక.

—† నాయకురాలు —

ఓరీ! బుడుతా! చిన్న పెద్దలను తారతమ్యంబు లేక యథేచ్ఛగం బేలుచుట్టి నీ నోటికిం దాళము నేయించెదను జూడుము. ఉచితజ్ఞత యెఱుంగని వాండవు నీవు పుట్టి యా బ్రహ్మనాయనికిం గూడ నపకీర్తిం దెచ్చుచున్నావు.

—§ బాలచంద్రుడు §—

(నవ్వుచు)

మహిరక్షకులగంధరాముడ్నుం జేసి
కలంచి చీకాకుపట్టిన కొలంది కరుడు
బ్రహ్మనాయనికైం బ్రేమ పట్టెం జెఱుపు
చెడి బ్రతుకుచాని కుచిత సుచితము లేల.

"పుట్టుకుంక" యని నందులకా యింత తెగ నీల్గుచున్నావు!

అవిచార్యంబులు నీవు మా కిడినక
ష్టానికములే మంత్రిత
వశం బరియ్యాను వీధిపోరుల తూ
గ్కం బోవు నీ కెల గా
రణరీతిం బిలంపుల్ కీ నుకిలురకవు
ర్యాదల్ ; భవద్వ్యాప్తి గా
చివడంబోవితిం – భై – న – బాలుండను – నా
చిత్యంబు నా కేటికిం.

అయినను నంత మాయారచనా ప్రవీణవై సాధువుల నల్లడతల్లడిం బెట్టు కుతంత్రజ్ఞ నెంత యవమానించినను దోషంబు లేదు. ఒకవేళం దాము గూడ మంత్రిపీఠార్హులగుటచేత మా తండ్రిగారు నిన్ను గౌరవింపవచ్చు నేమో కాని తెగబడి రణరంగంబున నపారసాహాత్రింబును బ్రదర్శించు యోధులకీ యుచితానుచితజ్ఞత లక్ష్యఱలేదు. అయినను — ఆ గౌరవము నీ వంటి చిలిపిగయ్యాళి యొడ్డం జూపుట కేవల మవివేకము.

—† నాయకురాలు †—

అవివేకమో వివేకమో చూపెదను. బీరంబులు పాలించి మగవాండ నై తివేని నిలువుము.

—§ బాలచంద్రుడు §—

ఏమీ ! మగవాండ నైన నిలువవలెనుగా! అవాచ్యంబులను దేహసంశోషణాపాదకంబులును నగు చెనరోగములచేం జివికిపోయినను వస్త్రధారణాద్యలంకరణంబులచేం బొంగిపడుచున్న వెలయాలు తీఱున సైన్యం బెంతయో మసియుటచే లోన గృశించుచు నీ వీరుని యెదుటంబడి నగము చచ్చినను జంబోతుగాంభీర్యంబు నింకను జూపుచున్న నీ బోటి ముదిబోడితోం దలపడుట కెమంత మగతనము గావలెను!





—* నాయకురాలు *—

బుడదలో బ్రాయి నైచుట వలె యుక్తాయుక్తపరిజ్ఞానము లేని కుల్పునితోడి ప్రసంగము ప్రాజ్ఞులకుం గూడని పని.

—‡ బాలచంద్రుడు ‡—

నా మాట యేమి గాని యుక్తాయుక్తపరిజ్ఞానము నీకు మాత్రి మెక్కుడుగా నున్నది.

మా తాత రెచ్చమాన్య వాంతిత్వంబు
బహ్మన్న కిక కిన్పించు నాండు
విషము ప్రయత్నమై విషభోజనము పెట్టి
మలిదేవులం జంపం దలంచు నాండు
కాంబరీకుక్కుట సమరంబు సాగించి
యవనిం గైకొని కాన కనుపు నాండు
అడవిపా లయిన మా యాఱుమందల కెల్లం
జెంచులం బంపి దోపించు నాండు
అందఱకు బాంధవుండు ప్రాయంపుం గుఱ్ఱ
ధీరుం డలరాజు మా రాయబారి రాంగం
జట్టి హింసించునాండు నేఁపట్టు లేర
నీకుం గల్గు యుక్తాయుక్త నిర్ణయంబు

—‡ నాయకురాలు ‡—

ఓరీ! మాటిమాటికి రాయబారిగా వచ్చిన యలరాజు మృత్యువువాతం బడుటకుం గారణము నేనే యని మీ రందఱు నొక్కి వక్కాణించుట యెంత సిగ్గుమాలిన పనియో మీ రింకను గ్రహించుట లేదు. ప్రధానమంత్రిపీఠం బలంకరించి యీ విశాలమయిన పల్నాటిరాజ్యంబంతయు నవిచ్ఛిన్నముగాం బరిపాలన మొనర్చుచు రాష్ట్రింబులోని మాననీయు లగు వారి కందఱకు స్తుతిపాత్రనై యుత్కృష్టప్రజారంజక జీవితంబు నడపుచున్న నా వంటివారిపై నిట్టి నింద్యాపవాదంబులు మీరువేసినను లోకము మాత్రము మీ మాటలు నమ్మునని విశ్వసింపకుడు? ఎవ్వరెట్టి ప్రవర్తనము కలవారో పల్నాడువారికి యొక్క నిశ్చితాభిప్రాయమునకు వచ్చియున్నది. మూఢా! ఇట్టి దుష్ప్రసంగంబుల కవకాశమిచ్చు నీ యది నాల్కా! కాటిదూలమా!

—† బాలచంద్రుడు ‡—

ఆ నాం డలరాజు నీ దుండగంబులం గూర్చి లిఖితరూపక మైన సాక్ష్యములు సూపింపం దలంచి నపుడు గాజుద్దాడిగికొని నీతో సమానంబుగ సింహాసనంబున సుఖోపవిష్టుండై యున్న నలగామరాజు సభ నావిపై చెవు గాని లేకున్న యీ నాండే కొలువు లోని వారి కందఱకు సర్వముం దెలిసి యుండెడిది. రాయబారిం జంపించి సాక్ష్యపుంగాగితములు మీరు కాజేసినను ... ...

—† నాయకురాలు ‡—

అదిగో! మఱల ననత్యము. ఇసుకలో నుండి వచ్చు తేగల వలె నీ నోటి నుండి వచ్చు ననత్యములకు మేర లేకున్నది.

—† బాలచంద్రుడు ‡—

కుడిచి కూర్చుండి యూరక యిట్టి దురపవాదంబులు నీపై మోపుటకు మా కేమి పట్టినది!

మంతికి లేకుండం జెడుకంపు పొలయదు, దట్టడు
కళ్లు లేకయు రోగంబు కూడంబడదు
మాటినను నగ్ని లేక ధూమంబు రాదు
నిజముగాం దప్పు లేకున్న నింద గలదె.

ఇంతటితో నిన్ను వదలిపెట్టుదు మని యూహింపకుము.

—§ కొమ్మరాజు § —

సెబాస్! బాలచంద్రుని పరాక్రమప్రాగల్భ్యము మిం దెవ రాగఁ గలరు.

—§ రామశాస్త్రి §—

తఱువాత బాలుం డింకను సైన్యదుర్గమారణ్యంబు ఛేదించుకొని ముందునకుఁ బోవుచుండెను. « అహా! దేశంబున నెంత ఘోరంబుగాఁ బోరు సల్పినను బాలుండు నాయకురాలిని బట్టి వల్లార్చె గదా » యని నిరవధికంబైన చలంబు నూపి కోలంకి వీరాస్వామి బాలుఁడున్న యెడకు వచ్చుచుండ నల్పసైనికసంఖ్యాపరివృతులై యున్న మన పెదమల్లదేవప్రభువులు త్రోవలోఁ గాన్పించుటచే వారిపైఁ దలపడెఁ — బాలుండు సమీపగతుండు కాక మునుపే — బొబ్బవెట్టుచు మనరాజచంద్రుని నోట నెత్తురు గ్రక్కించి నేల గొరగించి ప్రాణంబులం బుచ్చెను.

—§ కొమ్మరాజు §—

(విచారముతో) ఎంత సహింపరాని గతి యీ పక్షంబునకుఁ బ్రాప్తించినది! చెల్లెలి నిచ్చికొన్న వాఁడ నగుటచే నితరులకంటె నా దుఃఖ మీ విషయంబున దుస్సహంబు. అకటా! ఇంక నా సోదరీమణి యెట్లు జీవింపఁగలదో కదా. విధి చెయిదంబులఁ దప్పించుకొనలేము.

—§ రామశాస్త్రి §—

అంత బాలుండు పెదమల్లదేవనృపాలుని పతనంబు విని వర్ణనాదుస్సాధ్యంబైన మాత్సర్యంబున మచ్చరించుచు హుటాహుటిఁ జనుచు నొక మూలఁ జమూసమూహంబుల చేతఁ బరివేష్టితుండై యున్న నరసింగరాజుం జూచి త్రోవలోఁ గోలంకివీరాస్వామి తలపడగాఁ నతనిని క్షణంబులోఁ జిత్రవధం జేసి విడిచెను. బ్రహ్మాపుత్రుని రాపీక యుద్ధగించు రాజయోధులపై జడివాన వడువున తీవ్రసాయకంబులు పరగించి యుగ్రప్రతిహతావేశంబున నరసింగరాజురథంబుం గదిసి బాలచంద్రుండు « ఓరీ! దురాచరణశీలా! నీకు బాసటగా నుండు నాగమ్మను నొడలు బిడ్డలు సేసి విడిచితిని. దాని యనుచరుఁడ వైన్న నూరక పోనిచ్చుట తగవు గాదు. అందుచే గాన దాని ననుక్రోశంబున బోనిచ్చితినిగాని నిన్ను నే నొక్కటి కయ్యంబున బిండిపిచుం జేతుఁ జూడు » మనఁగా క్షత్రియజాతిసముచితంబైన రోసంబున నరసింగు కాఱులు పలుకుచు భల్లంబు లవిరళంబుగాఁ బంపి బాలుని కొక్కింత శ్రమ గలిగించెను. ధర్మయుద్ధసూత్రంబు లడ్డువచ్చుచుండుటచేఁ గారంపూడి కనకరాజు, గామాలపాటి రామానాయఁడు, నేలేశ్వరపు కాశీపతి మొదలగు యోధులందఱు వీరి ద్వంద్వయుద్ధంబున కాటంకము గలిగింపకుండిరి. కొంతసే పయిన వెనుక నొకరిద్దఱు పోయి నరసింగునకు సాయపడవలెనని గమకించిరి కాని యింతలో నెక్కడనుండియో కన్నమదాసు వచ్చి సేనలను యోధులను గలగుండు వడఁ జేసెను. ఆ సందడిలోఁ గొంతసేపు బాణంబునను మఱికొంతవడి కృపాణంబునను బరిశ్రమించి కడకు దళంబుల హాహాకారంబులు మిన్నుముట్ట బాలచంద్రుఁడు నరసింగు మస్తకంబు దెగనేసి డానిని కృపాణంబు కొనకు గ్రుచ్చి సేనాభయంకరంబుగా గాలిలో నాడించి విసరి పాఱవైచెను.

—* కొమ్మరాజు *—

బలే కుమారా! యుద్ధంబులలోఁ బ్రతిజ్ఞ నిర్వహించువారిలో నర్జునుని తఱువాత నీవే యనుటకు సందియము లేదు.

—§ రామశాస్త్రి §—

మల్లదేవులమరణంబుచే నసలే కలఁగిపోయిన బ్రహ్మనాయఁడు గారు నరసింగరాజు హత్యను గూర్చి విని యింతింత చింత పడిరని వర్ణింపఁజాలను. పరిచ్ఛేదితంబు లయిన నరసింగరాజు శిరంబును జక్క చేసి చూచి చూచి కన్నీటి కాల్వలుగట్టఁ గొంతసే పేడ్చి కడకు దగ్గఱనున్న వారికి వైరాగ్యోపన్యాస మొకటి గావించిరి. అది తాత్కాలిక వైరాగ్యంబుగాఁ దోఁప లేదు.

—§ కొమ్మరాజు §—

తఱువాత.

—* రామశాస్త్రి *—

అంతట నరసింగరాజు పడిపోవుటచే మన పక్షంబున నున్న సంతోషకోలాహలములు వర్ణనాతీతములు. ఉప్పొంగి కేరింతలు గొట్టుచు మన మూకలు పలుదెసలఁ దాండవించుచుండ నారివైపున గోపంబు హెచ్చకబంటికాఁగా బాలచంద్రుని ప్రతిజ్ఞా నిర్వాహణంబునకుఁ బళ్లు పటపటఁ గొఱుకు వారు గొందఱును మీసంబులనిక్క బొడిపించు వారు గొందఱును నుగ్రంబుగాఁ దారకావర్తనంబు గావించు వారు గొందఱును నిట్లు పెక్కుదెఱంగులఁ దమ యుద్వేగంబునకుఁ బ్రదర్శనవైచిత్ర్యంబొసంగుచుండ — నాపద్ధర్మంబు లెమ్మనుకొని — ధర్మయుద్ధసూత్రంబు లన్నియుఁ దెగద్రెంపి నాగుకేటిలోఁ గలిపి సలగాముగా జేసుకొని, శ్రమ దీర్చికొని ఖుజల వచ్చిన నాయకురాలు, మగఁటిమిలో రాశికెక్కిన యుక్కుతునకలు గొందఱుఁ — గలిసి, కౌరవయుద్ధంబునందలి పద్మవ్యూహంబులో ధార్తరాష్ట్రు లభిమన్యుని వలె బాలచంద్రుని జుట్టుముట్టి నానాప్రకారంబులుగా నల్లసంబు లాడుచుఁ గ్రోధంబులు గ్రక్కుచు నీతిబాహ్యదురాయుధవాగ్బాణంబుల నొప్పించుచు నాతనికి స్థానంబుగా నున్న సంభవమసైన్యంబును హతాశంబుగఁ జేయుచు విజృంభింప మొదలిడిరి. శిబిరంబునందు విచారంబున మునిఁగియున్న బ్రహ్మనాయనికిఁ గాని, యింకను గొఱఁతపడి తప్పించుకొని పోవక యడ్డుపెట్టుచుండు పాపిలేనపై దుమికి కత్తికొక కండ చొప్పున బలిదీయుచుండు కన్నమదాసునకుఁ గాని బాలచంద్రావస్థ గోచరింపకుండెను. శత్రువులు ధర్మసూత్రప్రతికూలమార్గంబునం దలపడుట నూచి బాలచంద్రుండు కొంతవడి నివ్వెఱపోయి చూచ్చెచెన్న కేశవుని. దండ్రియగు బ్రహ్మనాయని మనసున ధ్యానించి యగ్గలికరోషింప ననివార్య శరవర్షాపాతంబునఁ బరపంథిప్రతినాథ శార్వశ్రీని జల్లాగ్నిచు నార్పుచుఁ దచ్ఛరీరంబుల రక్తధారలం గార్చుచు యుద్ధదేవతావేశంబుం బొంటలు పెటిగి ముందు నిల్వంబడెకి యని ఖ్యాతివీరపజీవి బొట్టుపొరలగున ట్లొనర్చెను. బాలుం డిప్పుడు బహుళనా యని సమయము వేచియున్న నాయకురాలు మొదలగు వారు తుదవట్టున బ్రహ్మనాయని గారాబుబిడ్డపై నెడతెఱపిలేకుండ బాణప్రయోగంబు గావింపఁగా దాదాపుగా బడలిపోయిన యా సింహకిశోరము వైరాశ్యంబున జీవనపోటుగా నరదంబు నుండి దుమికి ప్రచండమండలాగ్రంబును బాహుదండంబుచేఁ ద్రిప్పుకొనుచుఁ గాశీపతిరథంబుపైఁ గవిసి యొక్క త్రుటిలో నాతని మృత్యుసాన్నిధ్యంబు నేర్చెను. ఈ సమయంబున బ్రత్యేకంబుగా నొక్క వీరునిపై దలపడఁ బోయిన బాలచంద్రుం డన్ని వంకల నుండి విశిఖాగ్నికి గుఱియై కాశీపతి పడిన యుఱుని మునంబుననే దళంబులన్నియు నదలింప రక్తంబు నోట నురువులు గట్టుచుండ నేలం బడి శంఖచక్రశార్ఙ్గధనురాద్యాయుధంబులచే విరాజిల్లు వైకుంఠేశ్వరుని దలంచుకొని మానసికయజ్ఞంబున బ్రాణహవిస్సుల వేల్చి పరమపదమైన వైకుంఠమందిరంబు నేరెను.

—॥ కొమ్మరాజు ॥—

దైవ మందలించు దుడిచిపెట్టినాఁడు. మన వైపు మల్లదేవునే కాక బాలచంద్రుని గూడ నెత్తుకొనిపోయి బ్రహ్మనాయుఁడు గారికిఁ జెన్నకేశవుండు మితిలేని విచారంబు గలిగించినాఁడు రామశాస్త్రి గారూ! బ్రహ్మనాయుని శిబిరంబునకుఁ బోయి యా మహాత్ముని ననునయించెదను. పల్లకీ వాండ్రను బంపుఁడు.

—॥ రామశాస్త్రి ॥—

మంచిది. (లేచి) కన్నమదాసు బాలచంద్రుని పాటు విని నేలంబడి యేడ్చి విచారకోపసమ్మిళితమనస్కుండై నాయకురాలిని బంధించి తెచ్చెదనని భీషణంబుగా గర్జించుచు నామెయున్నెడకుం బోయె ననుచున్నారు. ఏ మయినదో తెలియదు. మరల దర్శన మొనర్తును.

—॥ కొమ్మరాజు ॥—

మంచిది.

(తెరపడును)

దృశ్యము 27

నలగామరాజు ప్రవేశము.

—॥ నలగామరాజు ॥—

అవలంబితమైన మతమునే యతిమాత్రముగ నాదరించి దానికై ప్రాణంబులు గూడఁ గోల్పడఁ జేయు నట్టి మతోత్సాహము — లేక — మతిమౌఢ్యము భరతమాతకుఁ గొంత పుత్రశోక మాపాదించుచున్నది. నేఁటికాలంబున విరివిగా నాంధ్రదేశంబున బ్రబలి యున్న యీ శైవవైష్ణవమతములు పరస్పరసంఘర్షణమునకుఁ గారణములై తండ్రికొడుకులు, యన్నదమ్ములు నను భేదము లేక మౌఢ్యంబున నొకరి కత్తుక లొకరు తెగనఱకికొన జేయుచుండుట వలన నీ మతావేశము ధర్మజ్ఞులచే నిరసింపఁబడుచున్నవి. దీనికి దృష్టాంతము మేమే. మా తండ్రియగు నలుగురా జనల్పయశోవిశాలుండై నిర్విఘ్నముగా నుంచిన పల్నాటిరాజ్యము నా చేతిలోనికి రాఁగానే యైకమత్యము చెడి రెండు చీలికలై యపకీర్తి పాలగుటచే నానాఁడు నాగమ్మ గారి మాటల తీపివలనఁ దెలియక పోయినను గాలి చల్లాఱిన గృహంబువలెఁ గన్పడు నీ యుద్ధభూమిం జూచి గ్రహించుకొనుచున్నాను. రాజ్యైకత్వమును గూర్చియు మతసహనముఁ గూర్చియుఁ జిన్ననాఁడు బ్రహ్మనాయుఁడుగారు నేర్పిన నీతి సూత్రము లన్నియు మంటఁ గలిపి యీ రాజ్యమునకే కాకుండ నలుగురాజు కీర్తికిఁ గూడ భంగము గలిగించిన దుర్మార్గుం డగు నీ నలగాముఁడు శిక్షార్హుండైనను నా తమ్ములు పెదమల్లదేవుఁడు, చినమల్లదేవుఁడు నరసింగరాజు మొదలగు వారితోఁ గూడ రణభూమి యందుఁ ద్రెళ్లనీక యింకను బ్రతికించి యుంచుట శ్రీ సదాశివుని సంకల్ప మేమో తెలియకున్నది. రెండు పక్షంబుల లోను గావలసిన ప్రాణబంధువులలో ననేకులు యుద్ధాగ్ని నాహుతులై బ్రదికియుండునట్టి నాకు మాత్రము తీఱని దుఃఖము గలిగించినారు. కౌరవపాండవభండనమునకు దుష్టచతుష్టయము వలె నీ కారంపూడి యుద్ధమునకు నాగమ్మయే పునాది యనుటకు సంశయింపం బనిలేదని తోఁచుచున్నది. బ్రతికియుండి నన్ను విషయలోలత్వంబునం బడిపోయి చని పోయిన వెనుకఁ బాపకర్మఫలానుభవంబున బరితపించు జీవునివలె — నేనును నాయుఁడుగారు నేర్పిన మతసహనధర్మముఁ బోఁద్రోలి యాఁ నాఁడు నాగమ్మ మాటల తియ్యందనంబును వదలిపెట్ట లేక లోఁబడి మొదలు తెలియక చెట్టంత తమ్ములను బంధుగులను జంపుకొనవలసిన దురవస్థ దెచ్చి





కొని నేఁడు విలపించిన బ్రయోజన మేమున్నది? కోడిపోరు విషయంబున గాని యలరాజు హత్య విషయంబున గాని యామెయు నరసింగరాజుఁ బన్నిన రహస్యాలోచనములు మునుముందు తెలియక పోయినను గొన్నాళ్లకయినను యథార్థములు నా చెవిం బడుచుండెడివి. కాని యామె మాపించు శైవమతప్రచారసామర్థ్యమట్టిది! ఆ మాటల మైకమనుభవైకవేద్యమే కాని వాక్యానిర్వచ్యము గాదు. శైవమతోద్ధరణవిషయమై యామె యెట్టి మాఁటలయ్యందనము గలిగియుండనిదే నా ప్రేమాస్పదమైన కూఁతు మెడలోని మాంగల్యంబు ద్రెంపుట కామె పాల్పడినను బెల్లము గొట్టిన ఱాయి వలె మిన్నకుందును! అయ్యయ్యో! మతము పేరు పెట్టి యెన్ని చేయరాని దుష్కార్యములు నా పేరుతోఁ జేయించినది! ఘోరము! ఆమె యెన్ని దుండగంబు లొనరించిన దని వారనుచున్నారో దాబాపుగా నన్నియును యథార్థములై యుండు ననియే కదా — అవి సభాసదులు వినకుండుటకై — అలరాజును సాక్ష్యంపుఁ గాగితములఁ జదువనీక సభ నాపివైచితిని. మఱియుఁ బరమతసహనమే స్వమతంబునకును నభివృద్ధికారణ మని యానాఁడు సభలో నలరాజు ఘోషించిన విధ మనుభవము మీఁద నిశ్చయ మని గ్రహించితిని. బ్రహ్మనాయుఁడు గారి పంచమాస్పృశ్యతాప్రచారము గూడఁ దొలుదొల్త నున్నంత యేవగింపుగా నా కిప్పుడు గన్పట్టుట లేదు. ఆ మహాత్ముఁడు [illegible] తిరపతిరింబును చదువఁబడువ నూలమూదిగల నొక్క మాలనుగ్గ [illegible] తిరుగుటకు మనస్సింకను నిష్టపడకున్నది కాని వారి యవస్థ మిక్కిలి శోచనీయము; బుద్ధి మాత్రము గ్రహింపఁ జొచ్చినది. మొన్న పంచమసూత్రములలో మతవిషయకసంబంధములు పెట్టి వానికి ముక్కుపట్టి నన్నోడించి యీ సంధిప్రయత్నముఁ బాడుసేసినది కాని వారి పంచమాస్పృశ్యతా నివారణ ప్రచారంబున కడ్డువోకుండ మాచెర్లరాజ్యం బొసఁగినట్లయిన నాయుఁడుగారు కుక్కలను గూడఁ ద్రోవకుఁ దీసికొని వచ్చెడి వారే. యుద్ధావశ్యకతయు లేకుండెడిది. బంధువర్గం బంతయు బ్రతికియుండెడిది. పూర్వ మపుత్రకుఁడుగా నైనను ధృతరాష్ట్రుని జీవితం బెల్ల నిందాస్పదమో నా జీవితంబు గూడఁ గళంకదాయక మని యే చెప్పఁదగును. గతించిన దాని కిప్పుడు వగచి లాభము లేదు. (కొంచెముండి) ఆహవభూమి యందు నాయకురాలు కన్నమదాసుచేతఁ బట్టుకొనం బడి బంధితయై బ్రహ్మనాయుని కడకుఁ గొనిపోఁబడినది కదా. నాకు మాత్ర మింక నెవ్వరున్నారు! చిన్ననాఁడు నన్నెంతో గారాబముగాఁ జూచిన శాంతకరుణామూర్తి యయిన బ్రహ్మనాయుఁడు గారి కడకుం బోయి పశ్చాత్తప్తహృదయుండ నయ్యెదఁ గాక.

(నిష్క్రమించును)

దృశ్యము 28

బ్రహ్మనాయుఁడు శిబిరములోఁ గూర్చుండియుండును.

—॥ బ్రహ్మనాయుఁడు ॥—

దైవమా! చెన్నకేశవా! ఎందఱు వీరవతంసులఁ గారంపూడి యుద్ధభూమిలోఁ దెగటార్చితివి!

వృద్ధికాముండు మా చినమల్లదేవుండు
జీవితకావ్యంబు చిగురుఁ దొడుగ
మురళిచూడక యుల్లమా బాలకీర్తి
యుగ్రాహవోత్సుక యోధవరుఁడు
మా పెద్దరాజ్య మా మల్లదేవుని జోరు —
మల్లభూపతి పెరుమాళ్ళ కీర్తి

వించుగంగానదివలెనీ యహింస వగయను నేఁడమూ ఫలం బోవు ఈమార్గల కింత శాంత్యమృతం బిచ్చి నేదజేర్చి పాలించు నని గ్రహింపుము. కాని నే ను జెప్పి నట్లే యీ యుధము దుర్బలుర కలవిగానిది.

—§ కన్నమదాసు §—

తండ్రీ! భగవంతుండగు శ్రీకృష్ణుం డర్జునుని కి నిష్కామకర్మయోగము నుపదేశించిన మాదిరి నేఁడు దయచే నాకు దౌర్జన్యరాహిత్యసూత్రములచే నుపదేశము గావించుట ధన్యుండ నైతిని. ఇఁక ముందహింసానూత్రిలతికల నలుదిక్కులఁ బ్రచారామృతప్రసారంబున వృద్ధిఁ బొందించి వ్యాపింపఁ జేసెదఁ గాక.

(నాయకురాలిని జూచి) నాగమ్మగారూ! నేను మీ యెడలఁ గావించిన మహాపరాధమునకు మన్నింపవలెనని ప్రార్థించుచున్నాను.

—† నాయకురాలు †—

(తనలో) అహింసాసిద్ధాంతము ల నేను గూడ వినవలెనఁ గదే యింత సేపు కుమారునికి నాయుఁడు పదేశించినాఁడు. ఈతని యుద్యమంబులు గొన్ని నా కంగీకారార్హములు గాకున్నను మొత్తము మీఁద గొప్ప ధర్మజ్ఞుఁడని చెప్పక తప్పదు.

—§ కోటకేతుఁడు §—

ఆహా! మహాత్ముఁడు గదా బ్రహ్మనాయఁడు! నరసింగరాజు పెదమల్లదేవుఁడు బాలచంద్రుండు రణంబున నిహతులైరని విని పరితపించి పరితపించి వైరాగ్యముఁ దెచ్చుకొని నాయుఁడు గారు లోకోద్ధరణమునకు నూతన సూత్రంబులను బ్రతిపాదించుచున్నారు.

—‡ నలగామరాజు ‡—

కోటకేతుఁడుగారూ! క్రౌంచమిథునంబును గాంచిన వాల్మీకిమహర్షి రామాయణకథామృతంబు వర్షించిన విధమున నీ కార్యంపూడి యుద్ధపర్యవసానంబును బొడఁగనిన బ్రహ్మనాయుఁడు గారు దౌర్జన్యరాహిత్యసిద్ధాంతములు సముజ్జీవింపఁ జేయుచున్నారు. ఇఁక మనము బయలువడుదమా?

—* కోటకేతుఁడు *—

ఊఁ. (దగ్గఱకు వచ్చి) నాయుఁడు గారికి నమస్కారములు.

—♦ నలగామరాజు ♦—

(నాయుని జూచి యవమానముతో) నమస్కారములు.

—§ బ్రహ్మనాయఁడు §—

(నలగాముని జూచి యాశ్చర్యంబును మించిన సంతోషముతో) ఓహో! నా ప్రేమాస్పదుఁడు వచ్చినాఁడే. (పోయి కౌగిలించుకొనును)

—‡ నలగామరాజు ‡—

(కన్నీరు నించుచు) అయ్యా! మీరు చిన్నతనంబున నాకుఁ దండ్రితల్లులవోలెఁ దండ్రియంతవారయి రాజ్యపరిపాలన వివిధధర్మంబు లుపదేశించినను — మిమ్ములను ద్రోసి పుచ్చి — యీ నాగమ్మగారి మతకుతంత్రములలో మునిఁగి తేలలేక యామెకు లోఁబడి సర్వకార్యములందును నామెకుఁ గనుసన్న మెలంగుచుఁ దుదకుఁ గలిగిన బంధువుల నందఱను జంపుకొనిన నిర్భాగ్యుఁడనైతిని. పూర్వప్రేమంబును మఱచి పోరని విశ్వసించి శరణార్థినై వచ్చితిని.

—* బ్రహ్మనాయఁడు *—

నాయనా!

చిరకాలోచగతాతిమాత్రితచిర
స్నేహంబులుఁ గన్గవం
బరితాపంబున గొంతికాలము
పరామర్శించి తాఁగాంచి; నం





దరహాసీ ముఖచంద్రబింబము సుఖం
దర్శించి నా చిత్త మా
గర ముప్పొంగుచు నుంచి నేసిది న
ల్గామరాజు మాకల్లభా!

కలబాంధవ్యము మాసిపోవఁగ నిరో
గంబాల్ — ప్రసన్నంబగున్
కలహా — నిశ్చయమా — రోయుంగకు సుఖ
కష్టంబులఁ జూపెట్టి
తులు లేనుం బవసల్ వరిరో నిరుకు నం
తు కోన్నేట్టి యా మానవా
వరి కాలాఖ్యుని చేతి బొమ్మలం - గ్రహిం
పం జాల మీ చిత్రముల్.

తండ్రీ! కడచిన దానికిఁ జింతింపకుము. నీకు భయములేదు. రోహిణీ కార్తెలో వడదెబ్బ దగిలి కౌషిల్లిన లతాకుసుంగములు మృగశిరకార్తె వర్షంబున నేద జేఱు నట్లు దౌర్భాగ్యప్రభావమువలన విడిపోయిన మనమిరువురము నాకారం పూర్తికయ్యంబు వలన బునస్సమాగంబు చేసికొనఁ గలిగితిమి. పరమసంతోషము.

—‡ కోటకేతుఁడు ‡—

(నాయునితో) అయ్యా! తమరు మహాత్ములు. మహాత్ముల యాజ్ఞ యనుల్లంఘ్యము. పల్నాటిరాజ్యంబింక నే తీరున పాలింపవలెనో విచారింపవలె నని కూడుకొనుచున్నాము.

—* బ్రహ్మనాయఁడు *—

నేను మాత్రము చెప్పఁగలవాఁ పెద్దవాఁడనైతిని. నా యీ మిగిలిన జీవితకాల మంతయును వహింపను గూర్చియు నన్నుఁకొలాని రోధముఁ గూర్చియు దేశంబున దీర్ఘవ్రతోధంబు గావించుచు లోకక్షేమమునకై ప్రయత్నింపవలె నని యూహించుచున్నాను.

—* కోటకేతుఁడు *—

పెద్దలకు నే జెప్పఁగలవాఁడను గాను. అయిననూ

అంత యశోవిశాలుఁడగు
నల్లు సుహితని దాఁటు తెన్నా ధీ
మంతుల మీర లుండినను
మద్భుజ దర్ప బలపాట వంచు లో
కంతుకు లోకు లెల్లరును
పోషక వేయుదు రేలఁడే మన
కృంత నభ్రిష్టికై పచుల
చేతికిఁ బోవఁగ నీక రాజ్యముల్.

మాచెర్ల — గురిజాల — రెండు రాజ్యముల పరిపాలనంపు నిర్వహణము దమ మంత్రాంగకౌశలంబున గాని సాగనేరదు. కనుక మీ రభ్యంతరముఁ జెప్ప వలదని మనవి.

—* బ్రహ్మనాయఁడు *—

ముజల నన్ను మంత్రిత్వమునకు రమ్మనుచున్నారే!

—* నలగామరాజు *—

సర్వజ్ఞులగు తమరు చేయి పెట్టనిదే పని సాగించుటకును సాధ్యము గాదు.

—* బ్రహ్మనాయఁడు *—

బాలమల్లదేవుండు పిన్నతనంబున నుండుటచేఁ బరిపాలనము వల్ల నపరిచితుండు. రెండు రాజ్యంబులు ముజల నొక్కటియై దానికి నలగామరాజే యాధిపత్యము వహించుట నా కంగీకారమే.

—§ కన్నమదాసు §—

ఇఁక నాగమ్మగారి విషయము?

—* బ్రహ్మనాయుఁడు *—

నాగమ్మగారి పరిపాలనములోని లోపంబులును, నామె మాయొడఁగావించిన దుష్కృత్యంబులును నానపూర్విగ నీ వచ్చిన రాజులందఱ సముఖమునఁ దగినంతగా విశ్వాసార్హముగా నివేదింపఁ దలఁచితిని. విషయంబులన్నియు వెల్లడియైన గాని మంచి చెడ్డలు లోకంబునకుఁ దెలియవుగదా. నాగమ్మగారి యందు నా కెట్టి విరోధి భావమును లేదు. ఆమె గావించిన చేష్టల మాత్రము గర్హించుచున్నాను. పాపమును ద్వేషింపవలెఁ గాని పాపిని ద్వేషింపఁ దగ దని మహాత్ముల యభిప్రాయము.

—‡ నలగామరాజు ‡—

నాయుఁడుగారూ! అయిన దేమో యయినది. మీరు మాపింపఁబోవు నేరములన్నియు యథార్థము లని నేను బూర్ణముగ గ్రహించితిని. మఱల మీ రావిషయముఁ దఱచవలదని వేఁడుచున్నాను. మీరు మాత్రము గురిజాలలో మంత్రిత్వము వహింతు రని నా విశ్వాసము.

—* బ్రహ్మనాయుఁడు *—

(ఆలోచించి) కుమారా! నలగామా! ప్రజలలో నహింసాది సద్గుణంబు లలవడఁజేయుటకు నధికారము గూడఁ జేత నుండుట మంచిదియే కావున మంత్రిత్వమును స్వీకరించుటకు సమ్మతించుచున్నాను. ఏవిధముగనైనను దేశసేవ చేయవలయును. ఆ విషయ మట్లుండనిమ్ము. ఇంతికాలము మహోన్నతపదమునం దుండిన నాగమ్మగారిని రాజ్యంబు నుండి తఱిమివేయుట నా కిష్టము గాదు. ఆమె నింక మంత్రిపీఠంబున నుంచుట కంటె మత ప్రబోధంబునకు నియమించుట మిక్కిలి వాంఛనీయము. శైవమతానుసారిణియై తన మానసావలంబనమునకుఁ దగినట్లు శైవమతమున కామె యొనర్చిన సేవ నిరుపమాన మని చెప్పక తప్పదు. అంత వతోత్సాహము గల్గిన విద్యావతిని నగౌరవముగాఁ జూచుట పాడిగాదు. మఱియు

> శైవము వైష్ణవం బను ప్ర
> జామతముల్ సమరీతిఁ బెంచుచుం
> బోవలె సాధువర్తనుల
> బోధకులన్ నియమించి పోటి యే
> ర్పోవను లేక — శైవమత
> ధుర్యవహన్ మన నాగమాంబకే
> యీవలె వైష్ణవోద్యమము
> సిద్ధుని గన్నమదాసు పూనికన్
>
> మతసహనం బహింసయును
> మాలల యుద్ధరణంబు భోగముల్
> మితముగఁ బొందుటల్, కలిమి
> లేమి సమాదరణంబు, ధర్మసం
> స్మృతముగ మద్యపానమును
> మాన్పుట, లోకహితానుమోదిత
> వ్రతమును నిర్వహించుట, వి
> వేకుల — రాజుల — ముఖ్యధర్మముల్

—◆ కోటకేతుఁడు ◆—

కోవిదులగు మీ రుపదేశించు ధర్మము లమూల్యములు. మఱొక్కమాఱు సెలవిండు.

—‡ బ్రహ్మనాయుఁడు †—

(మఱలఁ జదువును)

—* నలగామరాజు *—

నిరభ్యంతరంబుగా మీ యిష్టం బనుసరించి ప్రవర్తింప నంసిద్ధుఁడను.

—† కన్నమదాసు †—

మాతండ్రిగారు మఱల రామరాజ్యమును బ్రతిష్ఠించుచున్నారు.





—† బ్రహ్మనాయుఁడు †—

నాగమ్మగారూ! మీ రవమానమును బొందసరములేదు. మిమ్ములను బల్నాటిరాజ్యంబుని శైవమతప్రచారమునకు ముఖ్యాధికారిణిగా నియమించుచున్నాము. తమ రీయుద్యోగమును గాకరింప రని నమ్ముచున్నాము.

—◆ నాయకురాలు ◆—

నాయుఁడు గారూ! పశ్చాత్తాపమున పాపపరిహారము గలుగునని తమ బోటి యార్యుల కడ వింటున్నాను. జరగిన దేమో జరగినది. నా లోపములకుఁ బాపములకుఁ బశ్చాత్తప్తనగుచున్నాను. నన్ను మన్నించినను స్వప్రయోజనార్థము గాదు నేను నమ్మిన శైవమతము నుద్ధరించుట కేమో యని యీయుఁ దమరు గ్రహింపవలెనని నా ప్రార్థన.

—* బ్రహ్మనాయుఁడు *—

సత్యముఁ బలికితిరి. మీ యాదర్శము నిష్కళంకమనియే కదా — నూర్గములు మాత్రము మార్చుకొనవచ్చునని శైవమతాధిపత్యంబును స్వీకరింపుఁడని బ్రతిమాలుచున్నాము! మన మతోద్ధరణదేవికి భూతదయాంగనను బానిసగా నుంచక సఖ్యకత్తెగా నుంచు నట్లంగీకరించిన జాలును.

—§ నాయకురాలు §—

మంచిది. అట్లే కావించెదను.

—† బ్రహ్మనాయుఁడు ‡—

(వినయముతో) అనుగృహీతుఁడను.

—† కోటకేతుఁడు †—

నా ప్రార్థన నంగీకరించినందులకు నాయుఁడు గారి నభినందించుచున్నాను,

—◆ బ్రహ్మనాయుఁడు ◆—

సకమాందోళనపరిచారములతో శైవమతనిర్వహణముఁగావింప నంగీకరించిన నాగమ్మగారికి నా నమస్కారములు.

—† నలగామరాజు †—

నాయుఁడుగారూ! యుద్ధహతావశిష్టులయిన రాజన్యులను సేనాప్రకరంబులను దగు గౌరవంబులతో వారివారి రాష్ట్రంబుల కనుపవలయును గదా.

—§ బ్రహ్మనాయుఁడు §—

మంచిది. నాగమ్మగారూ! పోవుదమా!

—§ నాయకురాలు §—

చిత్తము.

(అందఱు నిష్క్రమింతురు)

---

## అంకితము

శైలకన్నియ యొక్కతె కలదు నాకు
సవ్యరుచు లంత యెఱుఁగని నాఁటు. భిక్ష
మనసు మంచిది; నీకు సమర్పిత యిది
పరిణావవయ్య దేవ! లోకైకనాథ.

గ్రంథకర్త.

